# వాణి




విడి ప్రతి వెల 35 పైసలు

ప్రతి నెలా 7, 22 తేదీలు

22—11—1966

డిసెంబర్ 1-15 కార్యక్రమాలు

# ఐక్యరాజ్య సమితిలో భారతీయ సంగీతం



ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన అక్టోబర్ 23-వ తేదీన న్యూయార్క్ నగరంలో శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి (బృందం) గానం చేసిన దృశ్యం.
(ఈ కార్యక్రమం రికార్డును ఆకాశవాణి మద్రాస్ కేంద్రమునుండి డిసంబర్ 15-వ తేదీన వినవచ్చును.)



బాలల సంఘాల ఎక్స్‌మెంబర్లు పాల్గొన్న ఆటవిడుపు ప్రత్యేక కార్యక్రమము (ఇటీవల మద్రాస్ కేంద్రమునుండి ప్రసారితము)

వాణి
ప్రతినెలా 7, 22 తేదీలలో వెలువడును,
విడి ప్రతి వెల 35 నయాపైసలు,
సం॥ చందా రూ. 8-40 పై. (పోస్టేజి సహా)
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరింపబడదు.
ఇతర వివరములకు;
ఎడిటర్: "వాణి"
ఆల్ ఇండియా రేడియో మద్రాస్-4.
ఫోన్ నెం. 71041 ఎక్స్టెన్షన్స్ 243 & 245

ALL INDIA RADIO



సంపుటము XVIII — వాణి 22—11—1966 — సంచిక 13

# కళాపోషకులు: విజయనగర ఆనందగజపతి మహారాజు

యామిజాల పద్మనాభస్వామి

ఇంచుమించు నలభై యేళ్ళక్రితం మా నాన్నగారు చెప్పినమాటలు—భోజ రాజును, కృష్ణరాయలను చరిత్రలలో చదివి తెలుసుకున్నామేగాని మనం కళ్లారా చూడలేదు. మన విజయనగరం ప్రభువులు శ్రీ ఆనందగజపతి మహారాజుగారు భోజరాజుకీ, కృష్ణదేవరాయలకీ ప్రతిబింబం.

భోజరాజు దివంగతుడుకాగానే సరస్వతినిరాలంబ అయిపోయింది. పండితులు ఖండితులయారు కృష్ణరాయలు దివికేగినంతనే విద్యానగరం జీర్ణమైపోయింది

ఏ ముహూర్తాన ఏ అమృత ఘటికలో ఏ గురు శుక్ర దీక్షణబలంతో కళింగదేశ రాజధానికి విజయనగరం అని ఏమహానుభావుడు పేరు పెట్టాడోగాని అది ప్రత్యక్షమూ ఆనాటి విజయనగరానికి ప్రతిబింబమయింది. అది శ్రీమదానందగజపతి మహారాజు కాలంలో మూడు పువ్వులూ ఆరుకాయలుగా రాణించింది.

వేదాలకూ వేదాంగాలకూ, లలితకళలకూ ఆనందగజపతి మహారాజు కల్పవృక్షం అయాడు. ఆ చల్లని ప్రభువు పోషణలో విద్యాధిదేవత శారద కాళ్ళ అందెలరవళి సుతారంగా వినిపిస్తూ దశదిశలా పచ్చకప్పురపు పొడిల్లాగా ఘుమ్మఘుమలాడించింది.

దివ్యసుందరవిగ్రహం. మేరుధీరుడు, సముద్రగంభీరుడు. ఆకాశహృదయుడు ఆనందగజపతి మహారాజు అని కవులు వర్ణించారు. గాయకులు కీర్తించారు. వారాంగనలు నృత్యం చేశారు, వైదికులు ఆశీర్వదించారు.



తెలుగువాడుకాని బిడారం రాచప్ప పాడిన—

> ఎందుకి తొందర సుందరాకారా నీ
> పొందుగూడెద తాళరా—

అనే జావళీ యీనాటికి విజయనగర వీధులలో సాయం సంధ్యా సమయంలో చల్లని గాలులలో మెల్ల మెల్లగా వినవస్తూ వుంటుంది.

ఆనందగజపతి తురగ రేవంతుడు. ఎంత పెంకెగుఱ్ఱమైనా ఆ మహారాజు చేతిలో కీలుబొమ్మ అయిపోయేది. సాయంకాలం షికారు వెళ్తూ ఒక దాటు దాటించి చెట్టుకొమ్మ పట్టుకొని గుఱ్ఱాన్ని రెండు కాళ్ళతో నొక్కిపట్టి ఒకొక్క కొమ్మ పట్టుకుని క్రిందికి రావడం ఆ మహారాజు కో ఆట.

యీనాడు రూపురేఖలు లేకుండా అయి

## ఈ సంచికలో

ముఖచిత్రం: నాగార్జున కొండ శిల్పం
[శ్రీ మారేమండ శ్రీనివాసరావు రేఖాచిత్రం]
[శిథిలముల చరిత్ర నాగార్జునకొండ-అను విషయంపై రూపకం మాధ్యమిక పాఠశాలల కార్యక్రమముతో విజయవాడ కేంద్రమునుండి డిసెంబర్ 2-వ తేదీన వినవచ్చును.]

పోయిందేగాని ఆనాడు పెద్ద పువ్వులతోట ఆనందగజపతి మహా రాజు సృష్టించిన పద్మవ్యూహం. ఒక తెల్లదొర డంభాలు కొట్టి వెళ్ళిన తోవనే ఎందుకు రాలేను చూడండని లోపలికి వెళ్ళి తిరిగి రావడంలో రెండు చెట్లవరసలు తప్పివచ్చాడట. చిరునవ్వుతో మహారాజు చూశాడు. తెల్లదొర మొగం సిగ్గుతో మరింత తెల్లనై పోయింది భారతం సరసర్సా జీర్ణంచేసుకుని పద్మవ్యూహంలాగా చెట్లను నాటించాడా మహామేధావి.

ఆకార సదృశ ప్రజ్ఞః
ప్రజ్ఞయా సదృశాగమః
ఆగమైః సదృశారంభః
ఆరంభసదృశోదయః—

అని కాళిదాసు రఘువంశంలో దిలీపుణ్ణి వర్ణించినది తు.చ. తప్పకుండా ఆనందగజపతి కన్వయించింది. కులం, సౌందర్యం, విద్య, ధనం, బుద్ధి ఒకచోట వుండవంటాయి మన శాస్త్రాలు. అవన్నీ ఏ అవతారపురుషులో కారణజన్ములో అయిన వ్యక్తులకే చిక్కులు పడతాయి. పందొమ్మిదో శతాబ్దం సగం అయాక భారత దేశంలో జన్మించిన మహాపురుషులను రాజవంశీయులను తెలుసు కుంటే విజయనగర ప్రభువు శ్రీమదానందగజపతి ఒక్కడే అలాటి వ్యక్తిగా కనిపిస్తున్నాడు.

ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః—అని కాళిదాసమహాకవి పార్వతీదేవికి ఉపదేశమాత్రాన విద్యలన్నీ పూర్వజన్మ వాసనయా సంక్రమించాయని చెప్పాడు. అలాగే లింగల లక్ష్మాజీ, కిళాంబి రామానుజాచార్లు వంటి దిగ్దంతులు గురువులుగా దేశవిదేశభాషలలో విద్యలన్నీ ఆనందగజపతికి అరగడియలో హృద్గతాలయి విద్యల భోజుణ్ణి చేశాయి. సంస్కృతాంధ్రాలు సమపందెముగా రావడం చూసి లాటిన్, గ్రీకు, ఆంగ్లం ముప్పేటలుగా ఆ మహారాజుకి కంఠహారాలయాయి.

ఆ మహారాజు అనేవాడట. కవిత్వం దైవానుగ్రహంవల్ల వచ్చేస్తుంది. అది అంత గొప్పగా చెప్పుకోనక్కరలేదు. శాస్త్రం క్షుణ్ణంగా రావాలంటే బుద్ధి ఉండాలి—అని. అలాగే శాస్త్రవిద్వాం సులను ఎక్కువగా మన్నించడం ఆయనకి యిష్టం. ఆనాటి గజ పతి కొలువు ఒక సరస్వతీ మహల్.

### సరస్వతీ సభాభవనం

వైయాకరణ శిరోమణి పేరి కాశీనాథశాస్త్రిగారు, మహామ హోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, తర్కశాస్త్ర మహో దధి కొల్లూరు కామశాస్త్రులుగారు, సిద్ధాంత చూడామణి పిడుపర్తి దక్షిణామూర్తిశాస్త్రిగారు శ్రీమదానందగజపతి సరస్వతీ సభాభవ నానికి మూలస్తంభాలు. ముల్లోకాల దొర కొలువులో గీష్పతి ఒక్కడో విద్వాంసుడు. ఆయనకి ఒక్కటే తెల్ల యేనుగు. ఆనంద గజపతి కొలువులో అందరూ గీష్పతులే. అన్నీ తెల్ల ఏనుగులే.

ఇక గానవిద్యకి—తానే వైణికశిరోమణి: సాధ్యాయ గురాచారి రమణయ్యగారు. యీ యిద్దరికీ రమణయ్యగారి నాయన గారు గురువు. ఒకనాడు శిష్యులిద్దరూ వీణావాదనలలో పోటీపడి ఆవృత్తాలు వేశారు. ఒకగంటకాలంలో ఆనందగజపతి వేసిన ఆ వృత్తాలలో ఒకటి తక్కువగా రమణయ్య లెక్కకి రావడం చూసి గురువుగారు కొడుకు తగ్గిపోయాడనే విచారం లేకండా శిష్యుడు పైచేయి అయ్యాడని ఆనందబాష్పాలతో ఆశీర్వదించాడట మహా ధాతువు. ఆ గురుదెంత ఘనుడు.

### ఆదిభట్ల నారాయణదాసు

పైలాపచ్చీసు వయసులో అజ్జాడాదిభట్ల నారాయణదాసు మైసూరు మహారాజు దర్బారులో మధుర వీరగానంచేసి సన్మానం అందుకొని విజయనగరం వచ్చాక మహారాజుగారి గురువు లింగం లక్ష్మాజీ పండితుడు దాసు గానకళావైదగ్ధ్యాన్ని మహారాజుకిచెప్పి కొలువుకి రప్పించాడు. దాసుగారికి విద్యలన్నీ పుట్టుకతో వచ్చినవే అన్నింటా సహజపాండిత్యుడు. అన్నిటికీ తగిన స్ఫురద్రూపం కలవాడు. ఆనాడు ఆనందగజపతి అన్నివిధాలా పరీక్షచేసి ఆస్థాన వైణికుణ్ణి అసమర్థుడుగా రుజువుచేసిన దాసుగారికి నెలకి యింతా అని గౌరవవేతనం నిర్ణయించి పోషించనారంభించారు. కొత్తగా కొలువులో కాలుపెట్టినవాడు తన విద్వాంసుణ్ణి జితోస్మి అనిపించా డనే అక్కసుగాని చికాకుగాని లేకుండా కళారసజ్ఞతని వెల్లడిం చిన ఆ మహారాజెంత రసికుడు!

కేవలం శాస్త్రచర్చలలోనేకాక కవితావిలాసం చిత్తగించడం కూడా ఆనందగజపతికి లేకపోలేదు. అప్పటికప్పుడు ఆశువుగా తాను సమస్యలివ్వడం కవులు పూర్తిచెయ్యడం వుంటూ వుండేది. అలాటిఘట్టాలలో —సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్— అనే సమస్య ప్రసిద్ధమైంది. ఒకొకకవి ఒకొక్క పద్యం చెప్పగా మహారాజు తన వంతుగా ఒక పద్యం చెప్పడమయింది. దాసు గారినిచూసి మీరు సహజపాండిత్యులమని అంటూవుంటారు. ఇది మకుటంగా శతకం చెప్పండి యిప్పుడు—అని ఆ ప్రభువు అనగా వెంటనే అందుకొని నారాయణదాసుగారు నూరు పద్యాలున్నూ ఆశువుగా చెప్పారట. ఆ శతకం అచ్చయింది.

### తిరుపతి వేంకటకవులు

ఆరోజుల్లోనే నానారాజసందర్శనం చేస్తూ తిరుపతి వేంకట కవులు విజయనగరం వెళ్ళి ఆ మహారాజును దర్శించి చెప్పిన పద్యములన్నీ ఆనందగజపతి కారణజన్ముడైన కళాతపస్వి, కళా పోషకుడున్నూ అనే చెప్తాయి.

భవదీయ దర్శనంబాచరించి
ధన్యతను చెందె మా కవిత్వప్రశంస
శ్రీమదానందగజపతి క్షితిశశేంద్ర—

అని అన్నారు.

[తరువాయి 47-వ పేజీలో]

# పారిజాతాపహరణంలోని కల్పనలు

టి. వి. రంగాచార్యులు

సాహిత్యంలో ఇతిహాసాలు, పురాణాలు, ప్రబంధాలు, కావ్యాలు ఇత్యాదిగా అనేక శాఖలుంటాయి, ఉన్నాయి. సంస్కృతంలోనూ అంతే. తెలుగులోనూ అంతే. ఆ మాటకు వస్తే అన్నిభాషల్లోనూ అంతే అనవచ్చును.

తక్కినవాటిమాట ఎట్లా ఉన్నా మనకు మరీ సన్నిహితమైన, మాట సామెతకు మాట్లాడుకుంటే అసలు మూలకందమైన సంస్కృతంలో యీ శాఖలు అంతకన్న ఉపశాఖలతో విరాళంగా విస్తరిల్లి, వేలకువేల రచనలతో విలసిల్లుతున్నవి. దాని వరవడినే విశేషంగా దిద్దుకొంటున్న తెలుగులో గూడా ఇవి విశేషంగానే కనిపిస్తున్నాయి. అన్నిటికీ అన్నీ జనరంజకంగానే ఉండి పండిత పామరులందరినీ సమానంగా సంతోషింపజేస్తున్నాయి. ఈ సాహిత్య మహాసముద్రంలో అన్నిటికీ అన్నీ జనరంజకంగానే ఉన్నాయనడం అంత సబబుగాదేమో. కాని ఇందుకు అపవాదమైనవి అట్టే అంత ఎక్కువ ఉండవని గట్టిగా అనవచ్చు. ఈ జనమంచి వానిలోకూడ మరీ మధిస్తే కొన్ని మీగడతరకలు తేరుతాయి. అటువంటివాటిని కొన్నిటిని మనవారు నవకాలూ పంచకాలూ మొదలైన పేర్లతో ఎంగడించి ప్రత్యేకంగా పేర్కొనడం కద్దు. అలాంటి ఎంగడింపు మూలంగా ఏర్పడ్డవే అష్టాదశ పురాణాలూ, పంచకావ్యాలూ ఇత్యాదులు. సంస్కృతంలో ఇలాంటి పంచకావ్యాలు అందరూ ఎరిగినవే. అలాగే తెలుగులోనూ పంచకావ్యాలను ఎంగడించారు. అయితే అన్నిటిలోలాగే ఇందులోనూ ఆయా జాబితాల్లో పాఠాంతరాలు కనిపిస్తున్నాయి. అవి పాఠకుల అభిరుచులూ, వివేచనా విచక్షణలనుబట్టి ఉంటాయి. ఏమయితేనేం, సాహితీ సముద్రంలో జనమంచి వాటికి ప్రత్యేకించి ఇలాంటి ఎంగడింపు కట్టన్న మాటమాత్రం కాదు మన్నమాట. ఇట్టి ఎంగడింపు తెలుగులోనూ ఉంది.

## తెలుగు పంచకావ్యాలు

అలాంటి జనమంచి తెలుగు పంచ మహాకావ్యాల్లో ఒకటి మనకిప్పుడు ప్రస్తుతమైన పారిజాతాపహరణం అభిరుచి భేదాలనుబట్టో, అభిమాన దురభిమానాలనుబట్టో ఇది కొందరి కొన్ని జాబితాల్లో చోటు సంపాదించుకొనక ఉంటే ఉండవచ్చును గాని సాధుహృదయంతో గనక సమీక్షిస్తే యీ పారిజాతాపహరణం అందరి పంచకావ్యాల జాబితాల్లోనూ తప్పనిసరిగా ఉండి తీరవలసిందేనని ఖండితంగా చెప్పవచ్చు.

దీనిని రచించిన మహాకవి నంది తిమ్మన. కవితలోనేగాదు, పాండిత్యంలోనూ మహాఘటికుడు. తెలుగులోనే కాదు, సంస్కృతంలోనూ దిట్ట. ఆ రెండు భాషలనూ సాంగోపాంగంగా ఆపోశనపట్టిన జగజెట్టి. అందులోనూ ఇతడు తెలుగుదనానికి పెట్టింది పేరు. ఇంటా బంటా, నుడిలో నడలో ఆ తెలుగుదనం ఉట్టిపడుతుంది. ఊహల్లోనూ భావాల్లోనూకూడ అది తద్వృత్తంగా తొణికిసలాడుతూ వుంటుంది. వేషంలోనూ భాషలోనూ కూడా డిటో. ఇక ఆ తెనుగుమూర్తి తద్రూపంగా తన కావ్యంలో ప్రతిఫలిస్తాడంటే విప్రతిపత్తి ఎందుకు? పారిజాతాపహరణం ఆయన తెలుగుదనానికి, ఆయన తెలుగు జాతీయతకూ, తెలుగు పలుకుబడికీ, తెలుగుల పోబడికీ పట్టు ఒక నిర్మలమైన దర్పణమంటే అది మాటికి మున్మాటికీ సత్యం. దేశభాషలందు లెస్సయైనదిగా పేరు తెచ్చుకొన్న తెలుగు ముద్దుపల్కులకు యీ పారిజాతాపహరణం కాణాచి.

ఈ తిమ్మనమహాకవి ఇలాగే ఇంత తియ్యగానూ—వాణీవిలాసం—అనే ఇంకొక తెలుగుకావ్యం రచించినట్లు చెప్పుకొనదమైతే చెప్పుకొంటున్నారు గాని అది ఇప్పుడెక్కడా కనిపించిన పాపాన పోదు. దేవుడు మేలుచేసి అది లభిస్తే గిభిస్తే గనక ఈ కల్పం చిందులే అందులోనూ గోచరిస్తాయని గట్టిగా అనుకోవచ్చు. దానిమాటకేం గాని, యీ పారిజాతాపహరణ మొక్కటే ఆయన మూర్తినీ కీర్తినీ కలకాలం నిలబెట్టే కీర్తిపతాకగా, ఫోటో మూర్తిగా నిలిచిఉంటుంది. ఈయన ముద్దుపల్కులకు పెట్టింది పేరన్నాను. ఆ ముద్దుపల్కులే యీయనకు ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు అనే గట్టి కితాబు తెచ్చిపెట్టాయి.

## పుట్టుపేరు, పెట్టుపేరు

అన్నట్టు—నందితిమ్మననుగురించి ప్రస్తావిస్తూ, మధ్యలో ఈ ముక్కుతిమ్మన ప్రసక్తి ఏమిటంటారేమో. వాస్తవమే. చెప్పడం మరిచాను. మనం



కర్షక సదస్సు (ఇటీవల విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము)

చెప్పుకొంటున్న ఆ నందితిమ్మనే ఈ ముక్కుతిమ్మనాను. అక్షరాలా అంతే. నంది తిమ్మనకే తరువాత తరువాత ముక్కుతిమ్మన అనే పేరు వచ్చింది. పుట్టుపేరు పోయి యీ పెట్టుపేరే గట్టిగా రూఢిపడిపోయింది. ఈ పెట్టు పేరు రావడానికి అసలు రెండు కారణాలు చెప్తారు. అందులో ఏది నమ్మాలో సహృదయులే ప్రమాణం.

తిమ్మనకు ముక్కు పెద్దదట. ఈ పెట్టుపేరు అందువల్ల పుట్టిందేనట. ఇది ఒక పాఠం. ఎవరిదో ఏమోగాని. ఏ మహాసందర్భంలో చెప్పాడోగాని ఈయనగారు పనిగట్టుకొని ముక్కుపై ఒకపద్యానికి పద్యమే వ్రాశాడట. అందుచేత ఈ కొత్తపేరు ఆయనకు వచ్చిందట. ఇది ఇంకొక పాఠం. ఏమిటీ, అంతపేరు తెచ్చిన ఆ పద్యమేమిటి అంటారా? చెప్తా వినండి.

నానాసూనవితానవాసనల
నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి
బల్కాకన్ దపంబంది యో
షా నాసాకృతిదాల్చి సర్వసు
మనస్సౌరభ్య-సంవాసియై
పూనెం బ్రేంక్షణమాలికా
మధుకరీపుంజంబు నిర్వంకలన్.

ఇదండీ ఆ పద్యం. ఇంతకూ ఇది ఆయనదని ఎలా అంటున్నారో తెలియదు. ఇది వసుచరిత్రలో కనిపిస్తున్నది మరి. కాదు కాదు, ఇది అచ్చంగా తిమ్మనగారిదే. ఆయనదగ్గర కొనుక్కొని, యీ ప్రాస్తారిక పద్యాన్ని, వసుచరిత్రకారుడు తన వసుచరిత్రలో ఇరికించుకొన్నాడని యీ పాఠాంతర వాదులు తమ్మ తామే సమర్థించుకొంటున్నారు. ఇందులో ఏది నిజమో ఆ దైవానికే ఎరుక.

## కమ్మని కల్పనలు

కమ్మని కవితకూ, కమ్మని భావాలకూ, కమ్మని భాషకూ, కమ్మని పలుకుబడికీ కాదు; కమ్మని కల్పన లకుకూడా ముక్కుతిమ్మన పెట్టింది పేరు. ఆయన కల్పనల్లో ఒకరి మార్గాన పోరు. ఆయన కల్పనలు అచ్చంగా ఆయనవే. అవి అచ్చంగా ఆయన కాపీరైటు కల్పనలని గట్టిగా చెప్పవచ్చు.

అసలు ఆయన యీ పారిజాతాపహరణం రచనను పూనుకొన్న కారణమే ఒక కాపీరైటు కల్పన. దీనిని రచించమని దీనిని కృతిగొన్న కృష్ణదేవరాయలేమీ ఈయనను పిలిపించి తాంబూలం పెట్టి అడగనూ లేదు. ఈయన తన గొప్ప చాటుకోవడానికి దీన్ని రచించనూ లేదు. ఒక మహా ప్రయోజనాన్ని కోరి తిమ్మన దీనిని పనిగట్టుకొని వ్రాశాడు. ఆ మహా ప్రయోజన మేమిటంటారా? వినండి.

## ఒకవింతైన ఘట్టం

ఈ తిమ్మనకవి రాయలవారి చిన్న దేవేరి చిన్నాదేవితోపాటు పుట్టింటి అరణంలో అరణంగా వచ్చిన మహాకవి. కాగా ఈయన చిన్నాదేవికి చాలా ఆత్మీయుడు. ఆవిడ కష్టాల్లో సాగ్గాని అవసరమైనప్పుడు ఆవిడకు ఆదుకొని ఆవిడ కష్టాలను తొలగించవలసినవాడు. ఒకసారి ఆ రాజదంపతులకు దాంపత్యధర్మంగా కలహమేర్పడ్డది. ప్రభువొకనాడు ఏదో మహాకార్యంలో ఉండిపోయి, రాత్రి చాలా పొద్దుపోయిన తర్వాత శయ్యాగారానికి చేరాడట. రాచసంప్రదాయ మేమిటంటే, దేవరవారు వచ్చేటంతవరకూ దేవేరులు మామూలుగా తలగడవైపు తలపెట్టుకొని పండుకోరాదు; కాళ్ళవైపు తలపెట్టుకొని పండుకోవలెనట. దేవరవారు వచ్చి లేపినతర్వాత కే లేచి సరిగ్గా పండుకోవాలనట. ఈ సంప్రదాయాన్ని ఎన్నడేవికూడా రోజూ పాటిస్తూనే వచ్చింది. అయితే ఆ నాడేమయిందంటే, ఆవిడే గాఢనిద్రలో ఉందో, లేక ఆయనగారే గాఢనిద్రలో ఉండి, లేపడమెందుకని పెద్దమనసు వహించారో గాని ఆయనగారు ఆవిడగారిని రోజూవలె లేపనూ లేదు; ఆవిడగారు వసంతసూచనలేదు. ఫలితం? ఆయనగారు యథాప్రకారంగా తలగడవైపు తలపెట్టుకొని పండుకొన్నారు: ఆవిడగారు పండుకొన్నది పండుకొన్నట్లు కాళ్ళవైపు తలా, తలగడవైపు కాళ్ళూ పెట్టుకొని అలాగే ఉండిపోయింది. ఇద్దరూ మంచినిద్రలో పడిపోయారు. అర్ధరాత్రో అపరరాత్రో ఆవిడ నిద్రలోనే కదిలింది. ఆ కదలికలో ఆవిడకాళ్ళు ఆయనగారి తలకు తగిలాయి. తగిలి తగలగానే ఆయనకు మెలకువవచ్చింది. దిగ్గునలేచారు. కావాలనే దేవేరి తన్ను కాళ్ళతో తన్నిందనుకొన్నారు. వెంటనే లేవా... ఆవిడ ఇంకా మంచి నిద్రలోనే ఉండిపోయింది. ఈ జరిగిన పొరపాటు ఆవిడ ఎరిగనే ఎరగదు పాపం. కాని దేవరవారు ఆవిడను లేపి కసిరి కోపించినట్లయితే సరిపోయేది గాని, రాచదురభిమానంలో రాజుగారు ఆమాత్రం వివక్షనా చూపలేకపోయారు. సర్రున లేచి, ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయారు.

(తరువాయి 45-వ పేజీలో)

కథానిక :

# పరివర్తన

అచంట జానకిరామ్



ద్వారకలో అప్పుడే తెల్లవారింది.

కమలనేత్రి చేతులు జోడించి, మనవిచేస్తోంది. ప్రభువులు శ్రీకృష్ణుని తో,

"దేవి వారు నిద్రమేల్కొన్నారు. కాని, పర్యంకమునుంచి లేవలేదు. అమ్మగారు కోపంతో ఉన్నారు" అని

"ఆరోజున శ్రీకృష్ణుడు సత్యాదేవిని తీసుకొని ద్వారకకు సమీపాన ఉన్న లోయతోటలోకి వెళదామనుకున్నాడు. ఇప్పుడు పరిస్థితిమారింది.

ఎంత సంయమనాన్ని అలవరచుకున్నా, సత్యకు కోపంవచ్చిందీ అంటే శ్రీకృష్ణుడు భరింపలేడు. అతనికెంతో బెంగగా ఉంటుంది. అంత అంత పూర్తిగా పెనవేసుకొని పోయాయి వారిద్దరి జీవితాలూను. అతి సుకుమారమైన ఆ తీగలు రెండు ఒకదాని కౌగిటిలో ఒకటి ఎదురుతూ పైకి ప్రాకిపోవాలేగాని ఒకలత మరోవేపు అర అంగుళమైనా విడిగాసాగడం శ్రీకృష్ణుడు సహింపలేడు.

కమల వేతి మళ్ళా జ్ఞప్తిపరచింది ప్రభువు వారు ఒకపర్యాయం ఆ వైపు దయచేస్తే.... ....అని.

శ్రీకృష్ణుడుఆలోచించాడు. వెంటనే తను వెళ్ళడం అట్టే అంతబాగుండదు బాగుండక పోవడముమాట ఎలా ఉన్నా. పనికిరాకపోవచ్చును. మరొక్క క్షణము ఆలోచనలోఉండిపోయి, ఎంతో దయతో అన్నాడు అతను సాత్రాజితి నర్మసదితో ఇలా,

"వస్తాను; తప్పక వస్తాను. ఈ ఉదయమే మేమిద్దరమూ లోయ తోటలోకి వెళదామనుకున్నాముకదూ. రథం తీసుకు నేవస్తాను........ఇక నీవు వెళ్ళవచ్చు" అని.

"చూడు, కమలా" అనే మాటలు విని, ఆమెతిరిగి ఈలోకానికి వచ్చింది.

శ్రీకృష్ణుడు ఆమెవైపు అపారమైన దయదో చూస్తున్నాడు. ఇంత వరకూ అతని కంఠ సీమ నలంకరించిన ముత్యాలహారము అతని చేతిలో ఉన్నదిపుడు.

"ఇందా" అంటూ, ఆ హారాన్ని ఆమె దోసిటిలోఉంచాడు శ్రీకృష్ణుడు.

ఆమె ఆశ్చర్యపడలేదు.

"మహాప్రసాదము" అంటూ హారాన్ని కన్నుల కద్దుకుంది; కమలనేత్రి, సత్యాదేవిని లోయ తోట ప్రయాణానికి సుముఖురాలిగా చేయడానికి ఈ లంచము అని అతనికీ తెలుసు, ఆమెకూ తెలుసు.

## 2

చేమంతిపూలతో చక్కగా అలంకరించిన రథము సింహద్వారమువద్ద నిలచి ఉన్నది.

శ్రీకృష్ణుడు దీర్ఘాలోచనలో ఉండిపోయాడు, సత్యాదేవి కోపకారణాన్ని గురించి ఊహిస్తూ........తను ఏమి చేశాడు? ఏమిచేయలేదు? ఏ దేవేరిని మరీ ఎక్కువగా మన్నించాడు, నిన్నా మొన్నా? ........చటుక్కున, అతనికి స్ఫురణకు వచ్చింది? నిన్ననేగా, మిత్రవింద పుట్టినరోజు పండుగ, సత్యాదేవికి ఇటువంటివి ఇష్టములేదు అని తెలిసిఉండీ కూడా, ఏదోపేడాది కొకసారి కదా అని ధైర్యముచేసి వెళ్ళాడు తాను ఒక్కడే, సాయంత్రపు వేళ, మిత్రవిందకు తన నగల కానుకను, ఇదివరకే, ఆమె నమ్మిన సఖిద్వారా అంజేశాడు. ఆమె అతనికి హారతిచ్చి ఆహ్వానించుకున్నది. అతని పాదములను గోజ్జగినీట కడిగి, ఆ నీళ్ళను నెత్తిపై చల్లుకొని, పవిత్రమైన తన చేతికొనవేళ్ళను కన్నుల కద్దుకున్నది మిత్రవింద. అతడు ఆమె వెనుకను జేరి, తాను తెచ్చిన సంపెగ పువ్వు చెండును తానే స్వయముగా ఆమె జడలో పాయతీసి అందు సంతరించాడు, ఎంతోప్రేమతో, ముందుకువంగి ఆమె నడినెత్తిని తేలికగా ముద్దుపెట్టుకున్నాడు కూడ. పరవశురాలైన ఆమె తన వీపును బలముగా తన వక్షస్థలానికి అనించినది, ఆ తాకిడికి, ఆమెదెన అనురాగము పొంగి పొరలివచ్చి, ఆమెను తన కౌగిలిలోకి తీసుకున్నాడు అతి అన్యాయంగా తాను-క్షణకాలమే, వచ్చిన దేవేరులందరూ చిరునవ్వుల్లలో మెచ్చుకుంటూ ఉండగా క్షణకాలమే. కాని, ఆగుంపులో ఒకమూల సత్యాదేవి చెలికత్తె నళిని ఉన్నట్లు తాను ముందుగా చూడలేదు. అతని కౌగిటిలో మిత్రవింద ఇమిడి ఉండడము చూచి నళిని చటుక్కున ముఖము అటు త్రిప్పుకోవడము మాత్రము చూచాడు తాను, తరువాత కొంతసేపటికి తానువచ్చివేశాడు. తన రథము వరకూ దేవేరులందరూ అతనిని సాగనంపారు.

ఈ జ్ఞాపకంవల్ల శ్రీకృష్ణునికి అంతా అర్థమైంది. అతని ముఖాబ్జమున లేత చిరునవ్వు అంకురించింది. కాని, వెంటనే ముఖముచిట్లించుకొని, కొంత సేపటికి నిట్టూర్పు విడిచి వేచియున్న రథము వేపు నడువసాగాడు.

శ్రీకృష్ణుడు రథమునెక్కి, కళ్ళెములను సదలిస్తూ, రథమును నడుపసాగాడు. వాయువేగమునసాగి,రథము సత్యాదేవి భవనముముందు నిలచింది.

చప్పున నేలకు దుమికి, నాలుగు అంగలలో బంగారపు సింహద్వారమును దాటి, లోన ప్రవేశించాడు శ్రీకృష్ణుడు అతనికి స్వాగతమియ్యడానికి ఎవ్వరూ-వృద్ధకంచుకి, మందపాలుడు సైతము లేకపోవడము అతనికి ఆశ్చర్యాన్ని కలిగింపలేదు.

చలువరాతిలోనే అంగుళముఅంగుళమూ అత్యద్భుతంగా చెక్కిన తెర వంటి కుడ్యము వెనుకఉన్న సత్యాదేవి శయనాగారమును చేరి, తేరిచూచాడు, శ్రీకృష్ణుడు. పైనుండి ఒకే ఒక కిరణజాలము ప్రసవించే బంగారపు చక్రంలో, వాడిపోతున్న సత్యాదేవి ముఖ కమలాన్ని చూచాడు, స్వామి, ఆపుకోలేని మమతతో, చరచర ముందుకువెళ్ళి, తన రెండు చేతులతో అతి సుకుమారంగా ఆ అరవిందాన్ని పైకి యెత్తి తన పెదవులలో స్పృశించాడు ఆప్రేమమయుడు.

సత్యాదేవి మూసినకళ్ళను తెరువలేదు. శ్రీకృష్ణుడు మళ్ళామళ్ళా ముద్దుపెట్టుకున్నాడు, తన కోసమే బ్రహ్మ నిర్మించిన ఆపెదవులను కాని ఆ మధురాధరములు చలింపలేదు. వేడి నిశ్వాస మాత్రము అతని చెక్కిళ్ళను పసివాడ జేసింది.

శ్రీకృష్ణుడు సత్యాదేవిని మెల్లగా పర్యంకముపై పవ్వళింపజేసి, ఆస్వలనున్న కనక పీఠాన్ని దగ్గరకు తెచ్చుకొని, ఆసీనుడై దేవితో మెల్లగాచెప్ప సాగాడు. ఇలా "చూడు, సత్యా-చూడు: ఈ రోజున మనము లోయ తోటలోకి వెళదామనుకున్నాము కదూ? బయలుదేరవూ" అన్నాడు. శ్రీకృష్ణుడు ఎంతో అనునయిస్తూ.

సత్యాదేవిలో ఏమాత్రమూ చలనము లేదు.

మళ్ళా అన్నాడు, శ్రీకృష్ణుడు.

"సత్యా, సత్యా, ఎన్నాళ్ళనుంచి అనుకుంటున్నాము. మనము ఆలోయ తోటను చూడాలని, ఆసెలయేటిలో జలకమాడాలని, నాముద్దు చెల్లింపవా, సత్యా?" అని బ్రతిమిలాడాడు శ్రీకృష్ణుడు.

"అంతకోపమా నాపైన" అన్నాడు శ్రీకృష్ణుడు సత్యభామను ఆపాదమస్తకము తేరిచూస్తూ ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుంటూ.

ఆమె అతనిచేతిని విదలింప బోయింది.

ఇంతలోకి లోపలినుంచి ప్రవేశించిన కమలనేత్రి మంచి ముత్యాలు కుట్టిన మేలిముసుగును సత్యాదేవిపై కప్పి, క్రిందికిచూస్తూనే, ప్రభువుతో మనవి చేసింది, ఇలా "దేవర వారూ దేవేరీ ఇక లోయతోటలోకి వేంచేయ వచ్చును" అని ఎంతో వినయంగా.

## 3

బంగారపు రంగుపతాకలు గాలికి రెపరెపలాడుతూ, పట్టుకుచ్చుల రథము లోయ తోటవైపు వడివడిగా వెళ్ళుతోంది.

సాధువై నరసనే ఉన్నా, సత్యాదేవి మరీ ఒక ప్రక్కకు ఒదిగి కూచున్నది.

అతడామెను పలుకరింప ప్రయత్నింపలేదు. పలుకరించి ప్రయోజనం లేదని అతనికి తెలుసు.

కొంతసేపటికి, రథమార్గమున, వారికి ముందుగా నడచివెళ్తున్న ఒక గొల్లపడుచు కనుపించింది వారికి. నెత్తిపై చిన్నగంపను పెట్టుకొని, చేతులాడించుకొంటూ, అతి వయ్యారంగా నడచివెళ్తున్న ఆమె రథచక్రముల మ్రోత విని, వెనుతిరిగి చూచి, బాట అంచుకు తప్పుకుంది.

ఆమెను సమీపించినంతనే, శ్రీకృష్ణుడు రథము నాపి, ఆమె నుద్దేశించి, "గౌరీ ఇలా ఎంతదూరం వెళ్తున్నావు?" అని ప్రశ్నించాడు ఆ ప్రాంతంలో చాలామందికి ఈ పేరే ఉండడంమూలాన, గౌరి తనపేరు విని, ఉలిక్కిపడి, తరువాత వెంటనే తేరుకొని, అమాయకమైన తన నిండు కళ్ళలో ప్రభువును చూస్తూ, "దేవరా, ఆ కనుపించే మామిళ్ళగుంపులోనే మా గుడిసె, అక్కడకే వెళ్తున్నాను మీ దాసిని" అంటూ సత్యాదేవికేసి భక్తితో చూచింది.

ఇటువంటివారిని పలుకరించడము సత్యకు ఏమాత్రము నచ్చదు. కాని, శ్రీకృష్ణుని చేష్టలకు అర్థమును కల్పించడము ఎన్నడో మానివేసింది ఆమె. ఊరికే ఆకాశమువైపు చూస్తూ అట్టే ఉండిపోయింది ఆమె.

"దేవిగారిని వెంటబెట్టుకుని, లోయ తోటలోకి వేంచేస్తున్నట్టున్నారు, ప్రభువులు" అన్నది, గౌరి.



"అసుర సంధ్య" నాటికలో నటీనటవర్గం
(ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితము)

"అవును, అక్కడికే" అని, శ్రీకృష్ణుడు గౌరిపై తన చిరునవ్వులను చిలుకుతూ, "ఆ గంపలోనివి ఏమిటి, గౌరీ?" అని ప్రశ్నించాడు.

"ఏమీలేదు దేవరా, నాలుగు పుల్లదానిమ్మపళ్లు తీసుకువెళుతున్నాను, మా చెల్లె లక్ష్మికి" అన్నది గౌరి.

"పుల్లదానిమ్మపళ్ళా ఏం? లక్ష్మికి ఒంట్లో బాగుండలేదా?" అని ప్రశ్నించాడు—శ్రీకృష్ణుడు—ఆప్యాయత వెల్లువారగా.

"అదికాదు, దేవరా, మాచెల్లి మళ్ళా నీళ్ళుపోసుకుంది. ఇది మూడోకాన్పు. నోరు వికారంగా ఉంది అంటేను పుల్లదానిమ్మపళ్ళు తీసుకువెళ్ళుతున్నాను" అని శ్రీకృష్ణుడు అడుగకుండానే ఆమె మళ్ళా చెప్పసాగింది. "చెల్లెలి తొలిచూలు మగపిల్లవాడు—మూడో ఏడు ఇప్పుడు, మలిచూలు ఆడపిల్ల, రెండోయేడు" అన్నది.

"మరి నీకో?" అన్నాడు, శ్రీకృష్ణుడు.

గౌరి కాస్త సిగ్గుపడుతూ, "నాకు పిల్లలులేరు, దేవరా. అందుకే మా గొల్ల చెల్లెలినికూడా చేసుకున్నాడు. కాని, ఈ పిల్లలు నా పిల్లలే. చెల్లి పొలము పని చేస్తుంది, నేను పిల్లలనుసాకుతూ ఇల్లు కనిపెట్టుకొని ఉంటాను. దేవర దయవల్ల, మాకు నాలుగుకుంచాల పొలమూ, పది మావిడిమొక్కలూ, పాడిదూడలూ ఉన్నాయి బాబు ఆ పనంతా చెల్లె చూసుకుంటుంది. నేను బువ్వ వండి, పాపలను చూసుకుంటాను దేవరా" అంటూ చెప్పుకుపోతోంది గౌరి ఎంతో అమాయకంగా.

ఓరిమి మాని గుర్రాలు గట్టిగా సకిలించాయి.

సత్య కృష్ణునివైపు జూచింది, క్రీగంటితో.

కళ్ళెములను సడలించి, రథము కదలుతూండగా శ్రీకృష్ణుడు అన్నాడు, పరమకృపతో, గౌరితో—"దేవిగారికి లోయతోట చూపించి, వచ్చేత్రోవలో మీ కోనకు వస్తాము, మీగొల్ల ఉంటాడా?" అని.

"దేవర దయచేస్తాంటే ఉండ కెక్కడ కెళ్తాడు? తమ రాకకోసం ఎదురుచూస్తూ ఉంటాము బాబూ" అంటూ గౌరి మళ్ళా ఒక పర్యాయం సత్యాదేవివైపు జూచింది, అపరిమితమైన భక్తితో.

ఈసారి సత్యముఖాన చిరునవ్వుల చాయలు కనుపించాయి, ఏమూలనో. అది కనిపెట్టి శ్రీకృష్ణుడు లోలోన సంతసించాడు.

తొలి వసంతములో లోయతోట కన్నులపండువుగా ఉన్నది. లేమావి చిగురును మెక్కిన గండుకోయిలలు వారికి స్వాగతము పలికాయి. పురి విప్పిన మయూరములు వారికి త్రోవ చూపాయి. నిరంతర మధుప రవము శ్రవణానందకర సంగీతము సమకూర్చినది.

కాని, సత్యాదేవి ముభావము శ్రీకృష్ణుని ఉత్సాహాన్ని పూర్తిగా మరుగు పరచింది. అతను ఆశాభంగముతో బాధపడడము చూచి ఆమె లోలోన సంతసించింది. కాని, ఎక్కడో ఒక మూల, "అయ్యో ఎంత నొప్పిస్తున్నాను, నా నాథుని" అనే భావము మాటిమాటికీ ముల్లులా గ్రుచ్చుకుంటూనే ఉన్నది ఆమెలో.

ఈ దూరపు సహవాసము శ్రీకృష్ణునికి ఏమాత్రము రుచింపలేదు. ఒకచోట అతడు టక్కున ఆగి, "ఎండ ఎక్కువవుతోంది, ఇక చాలు. మరొక పర్యాయము రావచ్చు" అంటూ వెనక్కు తిరిగాడు. ఆ సుందర ప్రదేశంలో, ఈ స్థితిలో కూడా, నాథునితో కొంతసేపు—ఎంతోసేపు మసలుతూ ఉండాలని ఉన్నా, మారుమాటాడక, ఆమెకూడా అతనిని అనుసరించినది.

ఇద్దరూ రథము నెక్కారు.

## 4

కోనలో లేమావిగున్నల మధ్య పొదిగిఉన్న కుటీరము ఇవతల నిలచి, గౌరీ ఆమెభర్త గవరయ్యా వారిని

భక్తితో ఆహ్వానించారు. గుడిసెకు కొంచెము అవతలగా చెట్టునీడను విశ్రమించియున్న లక్ష్మిని చూచి వారు అవేపు నడిచారు. వారిద్దరినీ చూచీ చూడడముతోనే ఆమె చేతులుజోడించి నమస్కరించి, లేచి నిలువబోయింది. కాని, శ్రీకృష్ణుడు ఆమెను వారించి, చెంతనే నేలకు వంగిన ఒక మావి కొమ్మపైన సుఖాసీనుడయ్యాడు. గౌరి పరుగెత్తి గుడిలోనికి వెళ్ళి అందమైన రంగుల ముక్కాలిపీటను తెచ్చి దేవి కోసము అమర్చినది. సత్య ఆ పీట పైన విశ్రమించింది.

ఇంతవరకూ తల్లి వెనుకనువున్న పిల్లలిద్దరూ లోపలినుండి వచ్చిన గౌరివద్దకు ఒక్కపరుగున జేరి, ఎత్తుకొనమని తమ చిట్టిచేతులను పైకి ఎత్తారు. ఇద్దరినీ ఎత్తుకొని బుజ్జగిస్తూ సత్యాదేవికేసి చూస్తూ, "నన్ను విడిచి ఒక క్షణము ఉండలేరు, దేవీ—మా పిల్లలు, బంగారు పిల్లలు'' అన్నది, ఎంతో ఉత్సాహంతో, పిల్లలను మరీ మరీ ముద్దుపెట్టుకున్నది గౌరి.

గౌరిమాటను అందుకొని, అన్నది లక్ష్మి "కనడమే నావంతు, దేవీ, మిగతా అంతా గౌరిఅక్కే చూచు కుంటుంది. తిండి తినిపించడమూ, స్నానం చేయించడమూ, పడుకో పెట్టడమూ అంతా ఆమే. నిజానికి అక్కపిల్లలే వాళ్ళు" అని.

వీరిద్దరి అన్యోన్యతా, పిల్లల అమాయకపు అనురాగమూ సత్యాదేవి కెంతో ఆనందాన్ని ఇచ్చాయి. వెల్లువై వచ్చే ఈ మంచితనము ఆమెను సంతోషసాగరమున ముంచివేసింది.

సాధారణంగా మితభాషిణి ఐన సత్యాదేవి వారికేసి చూస్తూ "ఎంత అదృష్టవంతమైనది, ఈ మీ సంసారము'' అన్నది, ఆవేశంతో.

ఈ మాటలు వింటూన్న గవరయ్య సంతుష్టితో చిరునవ్వు నవ్వుతూ గుడిసెలోకి వెళ్ళి, రెండు బాదమాకుల దొన్నెలలో వేడిపాలు తెచ్చి సత్యాదేవికీ శ్రీకృష్ణునికీ అందించాడు.

పాలు త్రాగటానికి సందేహిస్తూన్న సత్యను చూచి శ్రీకృష్ణుడన్నాడు: తీసికో వారి గంగగోవు పాలు, చాలా రుచిగావుంటాయి" అని.

గవరయ్య అన్నాడు: "చిత్తం. ఈ గంగగోవు పాలు మేము ఎవ్వరికీ పొయ్యము దేవరా. పిల్లలకూ, దూడలకూ మాత్రమే అని. ఈపూట పితుకు మరిన్ని పాలిచ్చింది మీ రాక మా పూరిగుడిసెను పావనం జేసింది. మీ దాసులము మేము. దేవరకు ఇచ్చుకో గల కానుక ఈ మాత్రమే" అని ఎంతో వినయంతో

శ్రీకృష్ణుని మాట విని సత్యాదేవి పాలను రుచి చూచింది. "అబ్బ. ఎంత బాగున్నాయి ఎప్పుడూ ఇంతటి మంచిపాలను త్రాగలేదు" అన్నది.

శ్రీకృష్ణుడు మాత్రము తన దొన్నెలోని పాలను త్రాగకుండా, ఆ గొల్ల కుటుంబముపైపు అపారమైన కరుణతో చూస్తూ అట్లే ఉండిపోయాడు.

సత్య తన దొన్నెలోని పాలను సగముమాత్రమే సేవించి, గబగబ శ్రీకృష్ణునివద్దకు వచ్చి, ఆ దొన్నెను అతని పెదవులకు అందించి, "ఆ పాలను పిల్లలు త్రాగనివ్వండి" అని అతని చేతిలోని దొన్నెవైపు కన్నులతో సైగచేసింది. శ్రీకృష్ణుడు తన పాలదొన్నెను గౌరిచేతిలో ఉంచి, సత్య త్రాగి మిగిల్చిన పాలను తాను త్రాగివేశాడు. ఒక్కచుక్కైనా మిగల్చకుండా.

అప్పుడు సత్య శ్రీకృష్ణుని చీని చీనాంబరముతో పాలంటిన తన పెదవులను తుడిచికొని, తన పైట కొంగుతో శ్రీకృష్ణుని పెదవులను తుడిచి, మృదుమధురస్వరముతో, "ఇక వెళదామా" అన్నది.

వారిద్దరూ లేచారు,

చెట్టు నీడనేవున్న లక్ష్మి. "నేనుంటాను, దేవీ చల్లనివేళ దయచేశారు మా తోటలోకి దేవరా. మీ మేలు మరచిపోము'' అన్నది.

పిల్లలను ఇద్దరనూ ఎత్తుకొని గౌరీ, ఆమె వెనుకనే గవరయ్య వారిని రథమువరకూ సాగనంపారు.

రథము కదిలుతూండగా శ్రీకృష్ణుడు వారిపై బరపిన కటాక్ష వీక్షణము వారిని అనురాగజలధిలో ముంచితేల్చినది.

సత్యాదేవి ఇంటిముందు రథము ఆగింది.

శ్రీకృష్ణుడు రథమునుండి దిగి, చప్పున ఈవైపు వచ్చి, సత్యాదేవిని మెల్లగా క్రిందికి దింపుకున్నాడు.

తిరిగి తనచోట కూర్చుని, కళ్ళెములను వదలుతూ తనవైపు చూచిన నాథుని చెంతకు ఒక్క పరుగునవెళ్ళి, క్రిందకు జారిన అతని చేలాంచలమును సరిజేస్తూ, అతని కన్నులలోకి సూటిగా చూస్తూ, సత్య అన్నది, సిగ్గుదొంతరల మధ్య ఆమె బంగారపు పలుకులు వినీ వినిపింపనట్లు, ఇలా:

"రాత్రికి చెల్లెలు మిత్రవిందను విందుకు పిలుస్తున్నాను. మీరు తప్పకుండా రావాలి, తప్పకుండా రావాలి.''

అని, మళ్ళా అన్నది, చిరునవ్వుతో:

"వచ్చేటప్పుడు, సంపెంగ పూల చెండ్లు తెండి, రెండు'' అంటూ, కొంటెగా నవ్వింది.

సముద్రపుటంచున ఇన్ని చిన్ని ముత్యపుచిప్పలు కలబోసినట్లు ధ్వనించిన ఆ నవ్వును చెంతనే కనక పంజరాలలో ఉన్న రామచిలుకలన్నీ మరీ మరీ ప్రతిధ్వనించాయి.

సత్యాదేవి ఆ నవ్వు నిత్యసంతోషియైన శ్రీకృష్ణుని ఎంత ఆనందపరచిందో చెప్పలేము.




బెంగుళూరు కేంద్రంనుండి ఇటీవల ప్రసారమైన "Question Forum'' కార్యక్రమంలో పాల్గొన్న శ్రీ ఎస్. నరసింహన్ (ఎడమవైపు) శ్రీ సాగర్ అలి (కుడివైపు)




ప్రఖ్యాత మణిపురి నర్తకి నయన్ ఝవేరి (ఎడమవైపు) తో లలితా శివరాం ఉభయతార పరిచయ ప్రసంగం (బెంగుళూరు కేంద్రంనుండి ఇటీవల ప్రసారితము).

# ప్రసార విశేషములు

## అఖిల భారత సంగీత కార్యక్రమము



అహమత్ హుస్సేన్ ఖాన్: గాత్రం [డిసంబర్ 3]



మొహమ్మద్ సాగిరుద్దీన్ ఖాన్: సారంగి



గోపాలకృష్ణ: విచిత్రవీణ [డిసంబర్ 10]

అఖిల భారత సంగీత కార్యక్రమములో డిశంబర్ 3 వ తేదీ రాత్రి 9-30 గంటలకు మొహామద్ సాగిరుద్దీన్‌ఖాన్ గారి సారంగివాద్య కచ్చేరీని, అహమత్ హుస్సేన్‌ఖాన్ గారి గాత్ర కచ్చేరియును వినవచ్చును.

డిశంబరు 10 వ తేదీ రాత్రి 9-30 గంటలకు గోపాలకృష్ణ విచిత్రవీణమీదను మహాపురీ మఖ్యాగారి హిందుస్థాని గాత్ర కచేరీలను వినవచ్చును.

---

## గోదాదేవి

[ హ రి క థ ]

సత్యమైన, నిశ్చలభక్తితో మన మే కార్యమునైనను సాధించవచ్చునను నీతిని బోధించునట్టిదే గోదాదేవి చరిత్ర. ఆమె తన పవిత్రమైన భక్తితో దైవానుగ్రహమును పొందెను. శ్రీ ఎస్. సి. హెచ్. కృష్ణమాచార్యులగారి (గోదాదేవిచరిత్రపై) సంగీతోపన్యాసమును విజయవాడ కేంద్రము నుండి డిశంబరు 13 వ తేదీ రాత్రి 9-30 గంటలకు వినవచ్చును. ఈ కార్యక్రమమును హైదరాబాద్, కడప, విశాఖ పట్టణ కేంద్రాలనుండి గూడా వినవచ్చును.

## నాలుగిళ్ల లోగిలి

[ నా టి క ]

ఒక పెద్దమేడలో నాలుగు కుటుంబాలు గలవు. వారందరికి వసారా ఒక్కటే. అచ్చట ఒక కోడిగ్రుడ్డు పెంకు పడియుండుటను చూచి, ఆనాలుగుకుటుంబముల వారును ఒకరినొకరు దూషించుకొందురే గాని ఎవరును ఆ పెంకును తీయరు. చివరకు ఒక పసిబాలుడు ఆ పెంకును తీసివేసి, వారల అభిప్రాయభేదమును తగాదాలను తీర్చును. జె. సునందినీ దేవి రచించిన "నాలుగిళ్ళలోగిలి" అను నాటికను 'మహిళాసమాజం' స్త్రీల కార్యక్రమములో డిశంబరు 7 వ తేదీ మధ్యాహ్నం 1 గంటకు హైదరాబాద్ కేంద్రమునుండి వినవచ్చును.

## చార్ మినార్:

[ రూ ప క ం ]

పాతహైదరాబాదు నగర చారిత్రాత్మక కీర్తిని తెలుపు చిహ్నమే చార్‌మినార్ దీనిపై సి. హెచ్. భాస్కరరావు రచించిన రూపకమును హైదరాబాదు కేంద్రమునుండి, పిల్లలకార్యక్రమము 'బాల వినోదం' లో డిశంబరు 4 వ తేదీ మధ్యాహ్నం 2-20 గంటలకు వినవచ్చును.

## మాకూ ఉన్నాయి హక్కులు:—

ప్రస్తుతము స్త్రీకి పురుషులతో బాటు సమానహక్కులున్నాయి. స్త్రీ సర్వస్వతంత్రురాలు. అయినప్పటికిని, కొన్ని పాత దురాలోచనలు స్త్రీలో ఇంకనుఅట్లే ఇమిడియున్నది. పురుషులకుమాత్రమేగల కొన్ని ప్రత్యేకహక్కులను గూడ స్త్రీ పొందవలెనని ఆశించుచున్నది.

స్త్రీలుగూడ పొందవలసిన ఆ హక్కులేమిటి? వాటి ఆవశ్యకతేమిటి, మున్నగు విషయములను గూర్చి, 'రంగవల్లి' స్త్రీల కార్యక్రమములో హైదరాబాద్ కేంద్రము నుండి వి. కనకదుర్గాదేవి డిశంబరు 11 వ తేదీ మ॥ 1 గంటకు ప్రసంగించెదరు.

## భాషాసామరస్యం

తమతమ మాతృభాష, సంస్కృతులపైమాత్రమే గౌరవమును చూపుటవలన ప్రయోజనముండదు. మన మాతృభాష మనకెట్లు గొప్పయో అట్లే వారివారిభాషలు వారలకుగొప్ప అను సత్యమును గ్రహింపవలెను. అపుడే దేశమున ఐక్యత సమకూరును. భాషాసామరస్యమును గూర్చి డి. రామానుజరావు హైదరాబాద్ కేంద్రమునుండి డిశంబరు 11 వ తేదీ రాత్రి 7-45 గంటలకు ప్రసంగించెదరు.

## శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు

శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు రాజమంద్రిలో 1928 వ సంవత్సరమున జన్మించిరి. కాకినాడలోని పిఠాపురం రాజావారి కళాశాల చేరి, సంగీతమునందు పట్టభద్రులైరి. ఈయన మొదట శ్రీ మునుగంటి వెంకటరావువద్ద సంగీతము నభ్యసించిరి. తరువాత డాక్టరు శ్రీపాద పినాకపాణిగారు ఈయనను గొప్ప సంగీతవిద్వాంసునిగ తీర్చిదిద్దిరి.

శ్రీ వోలేటి వెంకటేశ్వర్లు ఎటువంటి క్రొత్తరాగములయినప్పటికిని అతి సునాయాసముగ పాడగల ధీశాలి.

ఈయన సంగీతమును డిశంబరు 1 వ తేదీ రాత్రి 8-15 గంటలకు విజయవాడ కేంద్రము నుండి వినవచ్చును.

## వ్యర్థంకాని కాలం

మన జీవితములో ఒక్కొక్క నిముషముగూడ చాలవిలువైనట్టిది. కనుక మానవులు జీవితములో ప్రతినిముషమును వినియోగించుకొనవలెను. మానవుని జీవితములో శాశ్వతముగ నిలచిపోవునది అతని కీర్తిమాత్రమే. వ్యర్థంకానికాలం అను విషయముపై డాక్టర్ ఎస్. గోపాలకృష్ణమూర్తి, హైదరాబాద్ కేంద్రం నుండి డిశంబరు 6 వ తేదీ రాత్రి 7-45 ప్రసంగించెదరు.

## మద్రాస్-సి

(వివిధ భారతి)

193.5 (1550 కిలోసై)

వారములో అన్ని రోజులు (శనివారం మినహా)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-40

(శనివారములు మాత్రం రాత్రి 6-30 నుండి 11-10)

[వివరాలు 48-వ పేజీలో]

## హైదరాబాద్-సి

వివిధభారతి (రిలే)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-35

(శనివారములు మాత్రం రాత్రి 6-30 నుండి 11-10)

[వివరాలు 48-వ పేజీలో]

## తిరుచ్చి-బి

202.7 మీ (1480 కిలోసై)

వివిధభారతి (రిలే)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-40

(శనివారము సా॥ 6-30, నుండి రా॥ 11-10 వరకు)

[వివరాలు 48-వ పేజీలో]

## దేశరక్షణ: ప్రత్యేక వార్తా ప్రసారాలు

ప్రతిదినము ఉదయం 6-40 ప్రత్యేక వార్తా ప్రసారము

(ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు ఈ కార్యక్రమము మద్రాస్-బి, హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.)

వారంలో శనివారము తప్ప మిగతా రోజులలో

ప్రతిరోజూ రా॥ 10-30 గంటలకు ప్రత్యేక వార్తా ప్రసారము

శనివారం రా॥ 11-00 ప్రత్యేక వార్తా ప్రసారము

ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు పై రెండు కార్యక్రమాలు హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్, కేంద్రములు రిలే చేస్తాయి.

## వివిధ భాషలలో వార్తా ప్రసారాలు

### తెలుగు

ఉ॥ 7-00 నుండి 7-15 వరకు

మ॥ 1-50 నుండి 2-00 వరకు

సా॥ 7-00 నుండి 7-15 వరకు

### హిందీ

ఉ॥ 8-15 నుండి 8-30 వరకు

మ॥ 1-40 నుండి 1-50 వరకు

రా॥ 8-15 నుండి 8-30 వరకు

రా॥ 10-35 నుండి 1-40 వరకు

### ఆంగ్లం

ఉ॥ 6-40 నుండి 6-45 వరకు

ఉ॥ 8-00 నుండి 8-15 వరకు

మ॥ 1-30 నుండి 1-40 వరకు

సా॥ 6-00 నుండి 6-05 వరకు

రా॥ 9-00 నుండి 9-15 వరకు

రా॥ 10-30 నుండి 10-35 వరకు

### తమిళం

ఉ॥ 7-15 నుండి 7-30 వరకు

మ॥ 2-00 నుండి 2-10 వరకు

రా॥ 7-15 నుండి 7-30 వరకు

## గురువారం డిసెంబర్ 1

శక 1888 మార్గశిర 10

### హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.00* పంచెమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6.10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 వాఙ్మయగోష్ఠి: నిలయవిద్వాంసులు
7.00 తెలుగులో వార్తలు
7.15 విజయవాడ వలె
7.45 సుగం సంగీత్ †
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 విజయవాడ వలె
9.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 For the Middle Schools (relay from Vijayawada)
12.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12.30* కార్మికుల కార్యక్రమము
పాటలు†
కార్మిక సంక్షేమ కేంద్రాలు
సీతాఫలమండి రూపకం
అభివృద్ధి నివేదిక
1.00 స్త్రీలకు (ఉర్దూ)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రపట్ సే†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, లలిత సంగీత్ †
2.10 ఉర్దూలో వార్తలు
2.20 విలాయత్ ఖాన్†
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 గ్రామలక్ష్మి (విజయవాడనుండి రిలే)
5.50 బాలవిహార్ (విజయవాడనుండి రిలే)
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలకు మాత్రమే)
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యావసాయిక విషయాలు
సరిచేలలో ప్రత్తిపంట సంభాషణ
కోడిగ్రుడ్లు పొదిగించే విధానము-తీసుకోవలసిన చర్యలు సంభాషణ
ధరలు, వాతావరణ వివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 టీక
7.30 చతురంగం (విజయవాడనుండి రిలే)
7.45 రాగం, తానం, పల్లవి: (విజయవాడనుండి రిలే)
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 లలిత సంగీతం†
8.57 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 Debate (relay from Delhi)
10.00 ఎమ్. ఎస్. పెన్నే
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు శనివారములు మాత్రము

సా॥ 5-30 నుండి రా॥ 11-10 వరకు

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై)

[హైదరాబాద్ మాత్రమే]

6.00* హైదరాబాద్ ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

62.50 మీ (4800 కిలోసై)

8.00 హైదరాబాద్ ఎ వలె
9.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* పంచెమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని: త్యాగరాజ కీర్తనలు
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 త్రిపురసుందరి బాబూరావు
7.45 సంగీత శిక్షణ: దేశభక్తి గేయం
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 కె. కన్నన్: వేణువు
9.00* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 For middle Schools
12.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)

[హైదరాబాద్ మాత్రమే]

11.45 హైదరాబాద్ ఎ వలె
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30* హైదరాబాద్ ఎ వలె
1.00 ఆర్. స్వామినాథన్
1.30 హైదరాబాద్ ఎ వలె
2.10 ఆర్. స్వామినాథన్
2.20 హైదరాబాద్ ఎ వలె
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

62.50 మీ (4800 కిలోసై)

5.30* హైదరాబాద్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ ఎ వలె
9.15 In the News (relay from Delhi)
9.20 విరామ సంగీతం (ఢిల్లీనుండి రిలే)
9.30 హైదరాబాద్ ఎ వలె
10.00 ఎమ్. ఎస్. సుబ్రహ్మణ్యం
10.30 హైదరాబాద్ ఎ వలె
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాద్-సి

246.9 మీ (1200 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]

ప్రసారము III

12.30* కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)
1.00 కె. కన్నన్: వేణువు
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 గ్రామలక్ష్మి పంచాయితీ పరిపాలనలో ముఖ్యసేవిక పాత్ర
5.50 బాలవిహార్
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 వాద్య బృందము
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 పంట సీమలు
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ వలె
7.30 చతురంగం రూపకం
7.45 రాగం, తానం, పల్లవి
వోలేటి వెంకటేశ్వర్లు
డి.పొంచ.రంగరాజు: వయొలిన్
యెల్లా సోమన్న: మృదంగం
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 చిత్రతరంగిణి- ఫిల్మ్ సంగీతం†
8.50 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 In the News
9.20 విరామ సంగీతం
9.30 Debate (relay from Delhi))
10.00 నృత్య సంగీతం ఎస్. గోపాలరత్నం
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

### విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## గురువారం డిసంబర్ 1

శక 1888 మార్గశిర 10

# మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 11-00 వరకు
మ॥ 11-55 నుండి 2-10 వరకు
సా॥ 5-30 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11-55 నుండి సా॥ 2-10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిపాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6.45 సంగీతామృతం
ఎస్. కల్యాణరామన్
7-15 తమిళములో వార్తలు
7-30 రాగం, తానం, పల్లవి :
శీర్కాళి గోవిందరాజన్
వి. ఎల్. వేదగిరి: వయొలిన్
మద్రాస్ ఎ. కన్నన్:మృదంగం
ఆర్. ఎస్. కృష్ణమూర్తిరావు: ఘటం
ఆర్. వి. పక్కిరిస్వామి: మోర్సింగ్
8-15 వల్లభం కల్యాణసుందరం
8-45 గీతమంజరి
9-15 రూపకం
9-45 పన్నిరుతిరుమురై †
10-15 ప్రసంగం (తమిళం)
10-30 Educational broadcast
English lesson for Standard VII conducted by C. Mortimer
10-55 అంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00* కార్మికుల కార్యక్రమము (తిరుచ్చినుండి రిలే)
12-30 పాఠశాలలకు (తమిళం)
1-00 కల్పకం సుబ్రహ్మణ్యం
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం
వలర్ పిరై
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* సంగీతమంజరి
5-45 రూపకం (తిరుచ్చినుండి రిలే)
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 శెయిదికురిప్పుగళ్
6-20 చిత్రగానం
పార్‌మగళే పార్, శారద
పెరియ ఇడత్తు పెణ్
పూంపుహార్, శాంతి
తైసిరందాల్ వళి పిరక్కు
6-45 వల్లభం కల్యాణసుందరం
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు
8-00 సి. సరోజ, సి. లలిత
ఎ. సుబ్బయ్య: వయొలిన్
పాల్ఘాట్ కె. కుంజుమణి: మృదంగం
ఆర్. ఎస్. కృష్ణమూర్తిరావు: ఘటం
9-00 అంగ్లములో వార్తలు
9-15 ఆటల సమీక్ష (తమిళం)
9-30 రంగనాయకీ రాజగోపాలన్:వీణ
10-30 చిత్రగానం†
తాయ్ సొల్లై తట్టాదె
ఉల్లాస పయనం
వీరఅభిమన్యు
తాయ్యైకాత్తతనయన్
విళక్కేట్రియవళ్
వాయ్‌కై పడగు
తాయుం మహలుం
11-00 George Melachrino and Semprini†
Richard Taurer: Tenor†
11-55 అంగ్లములో వార్తలు
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ వలె
6-40 అంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతమంజరి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 అంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

11-55 మద్రాస్ ఎ వలె
1-00 Johnny Glazel featuring Dice Garcia†
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 మహిళామండలి
స్త్రీల కార్యక్రమము
చరిత్రనడిపిన స్త్రీలు;
సుల్తానా రజియా ప్రసంగం
టి. వసంతలక్ష్మి
మృగతృష్ణ-పుస్తకం చదివి-
వంటచేయడం ప్రసంగం
కె. రామలక్ష్మి
మంగళం
2-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
[5-30 నుండి 6-40 వరకు 60.98 మీటర్లపైగూడా]

5-30* The Madrigal Singers†
Ambrosian Consort†
6-00 అంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు, కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 వాద్య సంగీతం:
వేణువు, వయొలిన్
7-30 University of the Air:
Radio programme to supplement Correspondence Course
8-00 U. N. Speaks
feature
8-15 అంజలి
8-30 Radio News Reel (relay from Delhi)
8-45 వాద్య సంగీతం: గోటువాద్యం
8-50 Today in Parliament
9-00 అంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 Debate (relay from Delhi)
10-00 మద్రాస్ ఎ వలె
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-సి

143.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

# బెంగుళూర్

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని, సుప్రభాత, విచార దీప్తి, వాతావరణ సూచన
6-40 అంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-15 ఎ. వి. నారాయణప్ప
నాదస్వరం
7-45 కన్నడములో వార్తలు
8-00 అంగ్లములో వార్తలు
8-15 చిత్రగీతె†
8-40 బజారు ధరలు
8-50 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

(బెంగుళూర్ మాత్రమే)

12-30* జి. వి. రంగనాయకమ్మ
1-00 వేణువు. సెల్లో, గిటార్:
నిలయవిద్వాంసులు
1-10 కన్నడములో వార్తలు
1-20 వేణువు, వయొలిన్, గిటార్:
నిలయవిద్వాంసులు
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 కావ్యవచన :
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-20 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 అంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
వాతావరణ సూచన (అంగ్లం)
6-10 గీతాంజలి :
6-20 కావ్యవచన :
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీతె †
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 ప్రసంగం (కన్నడం)
5-10 సుధావాహిని†
8-30 Radio News Reel
8-40 అంజనప్పస్వామి కృతులు:
నిలయవిద్వాంసులు
8-50 Today in Parliament
9-00 అంగ్లములో వార్తలు
9-15 వాద్యవృంద:
నిలయవిద్వాంసులు
9-30 ఎ. వి. కృష్ణమాచార్:వయొలిన్
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

* సమయ సూచన   † గ్రామఫోన్ రికార్డు   ‡ స్టూడియో రికార్డింగ్

## శుక్రవారం డిసెంబర్ 2

శక 1888 అగ్రహాయన 11

### హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

440.5 మీ (740 కిలోసై)

6-00* వందేమాతరం, మంగళధ్వని
కార్యక్రమ వివరణ

6-10 భక్తిరంజని

6-40 ఆంగ్లములో వార్తలు

6-45 సూక్తిముక్తావళి

6-50 విజయవాడవలె

7-00 తెలుగులో వార్తలు

7-15 గాంధీ మార్గము

7-40 విరామ సంగీతం

7-45 శాస్త్రీయ సంగీత్

8-00 ఆంగ్లములో వార్తలు

8-15 హిందీలో వార్తలు

8-30 గురురావ్ దేశపాండె

9-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-45 మాధ్యమికపాఠశాలలకు
(విజయవాడనుండి రిలే)

12-05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12-30* కార్మికుల కార్యక్రమము
(విజయవాడనుండి రిలే)

1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)

1-30 ఆంగ్లములో వార్తలు

1-40 చిత్రపదసే †

1-50 తెలుగులో వార్తలు

2-00 వాతావరణ సూచన,
రత్నం, లక్ష్మి

2-10 ఉర్దూలో వార్తలు

2-20 ప్రాదేశిక్ సంగీత్ :
ఆనందపల్లి, అనిల్‌బెచి

2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* స్థానిక ప్రకటనలు

5-35 లలిత సంగీతం :
ఎ. వి. సావిత్రి

5-50 పద్యపఠనం :

6-00 ఆంగ్లములో వార్తలు

6-05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
(హైదరాబాద్, కడపలు మాత్రమే)

6-15 ప్రాంతీయ వార్తలు

6-25 ముఖ్య ప్రకటనలు,
విరామ సంగీతం

6-30 గ్రామస్థుల రేడియో గోష్ఠి
ప్రత్యుత్తరవేదిక
రాష్ట్రములో పాడవు పోచప్రత్తి- అభివృద్ధి
సంభాషణ
ధరలు, వాతావరణము

7-00 తెలుగులో వార్తలు

7-15 జయభేరి రూపకం

7-30 టి. టి. సీత:
ఏ. కుప్పుస్వామి: వయొలిన్
ఎ. వెంకటేశ్వరరావు:
మృదంగం

8-50 Today in Parliament

9-00 ఆంగ్లములో వార్తలు

9-15 ఉర్దూలో వార్తలు

9-30 సాహిత్య నందిని
(విజయవాడనుండి రిలే)

10-00 గురురావ్ దేశపాండె

10-30 ఆంగ్లములో వార్తలు

10-35 హిందీలో వార్తలు

10-40 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు
శనివారములు మాత్రము

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

4-25* హైదరాబాద్ ఎ వలె

7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

62.50 మీ (4800 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె

8-30 టి. వి. విశ్వనాథన్

9-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

### విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, శుభోదయం
ప్రసార విశేషాలు

6-10 భక్తిరంజని
(హైదరాబాద్‌నుండి రిలే)

6-40 ఆంగ్లములో వార్తలు

6-45 సూక్తిముక్తావళి

6-50 బజారు ధరలు

6-55 విరామ సంగీతం

7-00 తెలుగులో వార్తలు

7-15 గాంధీ మార్గము

7-40 సుబుద్ధ సంగీత్

8-00 ఆంగ్లములో వార్తలు

8-15 హిందీలో వార్తలు

8-30 హైదరాబాద్ వలె

9-00 ప్రసార సమాప్తి

ప్రసారము II

11-45* మాధ్యమిక పాఠశాలలకు
శిథిలముల చరిత్ర: నాగార్జున కొండ
రూపకం

12-05 ప్రసార సమాప్తి

ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)
[హైదరాబాద్ మాత్రమే]

11-45 హైదరాబాద్ ఎ వలె

12-05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12-30* హైదరాబాద్ ఎ వలె

2-10 వాద్యసంగీతం†

2-20 హైదరాబాద్ ఎ వలె

2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

62.50 మీ (4800 కిలోసై)

5-30* హైదరాబాద్ ఎ వలె

7-00 తెలుగులో వార్తలు

7-15 హైదరాబాద్ ఎ వలె

9-15 In the News
(relay from Delhi)

9-20 విరామ సంగీతం
(ఢిల్లీనుండి రిలే)

9-30 హైదరాబాద్ ఎ వలె

10-00 టి. వి. విశ్వనాథన్

10-30 హైదరాబాద్ ఎ వలె

10-40 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

### హైదరాబాద్-సి

*(245.9 మీ (1220 కిలోసై)*
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

మ॥ ప్రసారము III

12-30* కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
కంచె చేను మేస్తే నాటిక
రచన: నక్కా వెంకటేశ్వరరావు
విశేషాలు, కబుర్లు

1-00 వనితావాణి
స్త్రీల కార్యక్రమము
పాట
జీవితోదయం
సీరియల్ నాటిక
3వ భాగం
తమిళ మాతృక ; మాయావి
తెలుగుసేత, నిర్వహణ ;
పి. శ్రీనివాసన్

1-30 ఆంగ్లములో వార్తలు

1-40 హిందీలో వార్తలు

1-50 తెలుగులో వార్తలు

2-00 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* స్థానిక ప్రకటనలు

5-35 లలిత సంగీతం, పద్యపఠనం
(హైదరాబాద్‌నుండి రిలే)

6-00 ఆంగ్లములో వార్తలు

6-05 వాద్య బృంద

6-15 ప్రాంతీయ వార్తలు

6-25 ముఖ్య ప్రకటనలు
విరామ సంగీతం

6-30 పంటసీమలు
గ్రామీణ రేడియో గోష్ఠి
ప్రకటనలు, ధరలు,
వాతావరణ వివరాలు

7-00 తెలుగులో వార్తలు

7-15 హైదరాబాద్ వలె

7-30 సంగీతకచ్చేరీ
(హైదరాబాద్‌నుండి రిలే

8-50 Today in Parliament

9-00 ఆంగ్లములో వార్తలు

9-15 In the News

9-20 విరామ సంగీతం

9-30 సాహిత్యనందిని
సాహిత్య సంచికా కార్యక్రమము
కవి-సామాజిక సమస్యలు
ప్రసంగం
స్వీయకవిత

10-00 చావలి కృష్ణమూర్తి

10-30 ఆంగ్లములో వార్తలు

10-35 జనగణమన, ప్రసార సమాప్తి

### విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]



* సమయమాత్రక † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

శుక్రవారం డిసెంబర్ 2

శక 1888 అగ్రహాయన 11

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6.00 నుండి 11.00 వరకు
మ॥ 11.55 నుండి 2.30 వరకు
సా॥ 5.30 నుండి రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11.55 నుండి సా॥ 2.30 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6.40 నుండి రా॥ 11.00 వరకు

6.00* వందేమాతరం, మంగళగానం
6.05 తుదిప్పాడల్‌గళ్
6.30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6.35 అరుళ్ వాక్కు
6.40 బజారు ధరలు
6.45 సంగీతామృతం · ఎస్. బాలచందర్: వీణ
7.15 తమిళములో వార్తలు
7.30 గాంధీ అంజలి
8.00 తిరుప్పాపులియూర్ వి. రాజం: వయొలిన్
8.45 చిత్రగానం
ఇరవుంపహలుం
రత్తకణ్ణీర్
వానంబాడి, పళని
పడగోట్టి
రత్తతిలకం
9.15 చిత్తూర్ సుబ్రహ్మణ్య పిళ్లై; ఎల్. గణపతయ్య పిళ్లై: వయొలిన్
ఆర్. రామమూర్తి: మృదంగం
ఎ. కన్నియన్: ఘటం
జి. హరిముత్తా పిళ్లై: కంజీరా
10.30 మధురగీతం
10.55 ఆంగ్లములో వార్తలు
11.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.55 ప్రాంతీయ శెయిదిగళ్
12.00 కార్మికుల కార్యక్రమము
12.30 పాఠశాలలకు (తమిళం)
1.00 మాదర్ నిగళ్చ్చి స్త్రీలకు
1.30 వాద్యగోష్ఠి
1.45 చిత్రగానం
పి. బి. శ్రీనివాస్
ఎల్. ఆర్. ఈశ్వరి
1.55 వాతావరణ సూచన
2.00 తమిళములో వార్తలు
2.10 పాఠశాలలకు (తమిళం)
2.40 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* మెల్లిసై; టి. రుక్మిణి
టి. కె. రామచంద్రన్
5.45 వాద్యగోష్ఠి
6.00 విరామ సంగీతం
6.05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 శెయిదికురిప్పుగళ్
6.20 శ్రోతలుకోరిన పాటలు
6.45 మినామణి
7.15 తమిళములో వార్తలు
7.30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8.00 నాటిక (తమిళం)
8.30 వాద్య సంగీతం
8.45 ఈమాసపు పాట: జి. వైదేహి
8.50 విరామ సంగీతం
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 పి. ఎస్. వీరుస్వామి: నాదస్వరం
10.30 చిత్రగానం
చిత్తి, ఆశైముగం
కన్నిత్తాయ్, ఆనంది
కుళందైయుం దైవముం
ఆయిరత్తిల్ ఒరువన్
చిత్రాంగి
11.00 హిందూస్థానీ సంగీతం†
భీమసేన్ జోషి†
11.55 ఆంగ్లములో వార్తలు
12.00 ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6.00 మద్రాస్ ఎ వలె
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీతమంజరి
7.30 సంగీతరూపకం (తమిళం)
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)
41.90 మీ (7160 కిలోసై)
2.10 నుండి 3.00 వరకు

11.55 మద్రాస్ ఎ వలె
1.00 Billy Thorburn and his Strict Tempo: Dance Music†
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 నిలయవిద్వాంసులు: వీణ
2.30 విరామ సంగీతం†
2.40 పాఠశాలలకు
మరపురాని మనీషి: వేదం వెంకటరాయశాస్త్రి ప్రసంగం
వి. వెంకటరాయశాస్త్రి
3.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
[సా॥ 5.30 నుండి 6.40 వరకు 60.98 మీటర్లపైగూడా]

5.30* Jimmy Shand and his band†
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 మద్రాస్ ఎ వలె
6.20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు వాణిజ్య వార్తలు కార్యక్రమ వివరణ
6.45 Police news
6.50 సంగీత మంజరి
7.00 తెలుగులో వార్తలు
7.15 జయభేరి రూపకం (తెలుగు)
7.30 University of the Air-Radio programmes to supplement Correspondence course
8.00 Science and International Cooperation: Geology talk by S. Krishnaswami
8.15 మధుర గీతం
8.30 మెల్లిసై,
ఆర్. మయూరవల్లి
బి. గోపాలం
8.45 వాద్య సంగీతం క్లారినెట్, వయొలిన్
8.50 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 In the News
9.20 విరామ సంగీతం
9.30 Brahms and Mendelssohn†
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూరు

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.30* వందేమాతరం, మంగళధ్వని సుప్రభాత, విచారదీప్తి వాతావరణసూచన
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 కార్యక్రమ వివరణ
6.50 గీతారాధన
7.15 గాంధీ స్మృతి
7.40 భజన్†
7.45 కన్నడములో వార్తలు
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 మార్గదర్శన
8.30 మల్లికార్జున్ మన్సూర్
8.40 బజారు ధరలు
8.50* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II (బెంగుళూర్ మాత్రము)

12.30* వనితావిహార
1.10 కన్నడములో వార్తలు
1.20 మల్లికార్జున్ మన్సూర్
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 మల్లికార్జున్ మన్సూర్
2.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3.00* ఉన్నతపాఠశాలలకు
3.20 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* కార్మికుల కార్యక్రమము
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు వాతావరణసూచన (ఆంగ్లం)
6.10 కావ్యాస్వాద
6.20 జానపదగీతె †
6.35 ప్రదేశ సమాచార
6.45 చిత్రగీతె †
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడములో వార్తలు
8.00 సమాచారదర్శన
8.10 సుధావాహిని
8.20 Western Music†
8.50 Today in Parliament
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 మద్రాస్ వలె
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి



* సదాయ సూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## శనివారం డిసెంబర్ 3

శక 1888 మార్గశిర 12

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమవివరణ
6.10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి
6.50 వాద్య గోష్ఠి నిలయువిద్వాంసులు
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (విజయవాడనుండి రిలే)
7.30 వాద్య సంగీతం† నాదస్వరం
7.45 సుగం సంగీత్
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 విజయవాడ వలె
9.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 మాధ్యమిక పాఠశాలలకు (ఉర్దూ)
12.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12.30* కార్మికుల కార్యక్రమము
పాటలు†
జగన్నాథం కలలు స్కెచ్
రచన: వి. సత్యనారాయణ
ఉత్తరాల సంచి
1.00 తరుణ భారతి (విజయవాడనుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రపథ్ సే†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, సుగం సంగీత్ :
2.10 ఉర్దూలో వార్తలు
2.20 చహల్ పహల్ ఉర్దూలో కార్యక్రమము
3.00 కన్నడ శ్రోతలకు
3.15 మరాటీ శ్రోతలకు
3.30 బాలానందం
రారండోయ్
నెమలి గ్రుడ్లను మ్రింగిన నక్క-కథ
రాజెన్ బాబు పెన్ స్కెచ్
మీ పకపకలు
4.00* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 విజయవాడ వలె
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యావసాయిక విషయాలు
రాజేంద్ర ప్రసాద్‌గారి జీవిత విశేషాలు ప్రసంగం
వర్షాకాలంలో కోళ్ళగృహాలు: జాగ్రత్తలు సంభాషణ
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 రాజర్షి రాజేంద్ర ప్రసాద్ ప్రసంగం
7.25 విరామ సంగీతం
7.30 రాష్ట్ర వికాసవేదిక గోష్ఠి
7.45 నాటిక
8.00 ప్రసంగం (హిందీ)
8.10 పరిచయపత్రం
8.20 ప్రసంగం (ఉర్దూ)
8.30 Radio News Reel
8.40 చిత్రసీమ†
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 అఖిలభారత సంగీత కార్యక్రమము
మొహమ్మద్ సాగిరుద్దీన్‌ఖాన్: సారంగి
అజామత్ హుస్సేన్‌ఖాన్: గాత్రం (ఢిల్లీనుండి రిలే)
11.00 ఆంగ్లములో వార్తలు
11.05 హిందీలో వార్తలు
11.10 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

## కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు శనివారములు మాత్రము

సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై) (హైదరాబాద్ మాత్రమే)

6.00* హైదరాబాద్ ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని :
శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, ఏకాదశి కీర్తనలు
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం†
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (సీనియర్లకు)
7.30 పాలవెల్లి
చాక్లేటా రారండి
బాలదీపం సీరియల్ కథ (1-వ భాగం)
చిలకపలుకులు, ఇకజాలు

ప్రసారము I (తరువాయి)

62.50 మీ (4800 కిలోసై)

8.00 హైదరాబాద్ ఎ వలె
9.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై) (హైదరాబాద్ మాత్రమే)

11.45 మహక్తాల్ వరసరాజన్
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30 హైదరాబాద్ ఎ వలె
2.10 చిత్రసీమ†
2.30 కె. పుష్ప
3.30 హైదరాబాద్ ఎ వలె
4.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

62.50 మీ 4800 కిలోసై)

5.30* హైదరాబాద్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ ఎ వలె
8.20 స్వరపల్లవి:నిలయువిద్వాంసులు
8.30 హైదరాబాద్ ఎ వలె
9.15 In the News (relay from Delhi)
9.20 విరామ సంగీతం (ఢిల్లీనుండి రిలే)
9.30 హైదరాబాద్ ఎ వలె
11.10 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]

8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 వాద్య బృందం
9.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30* కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1.00 తరుణభారతి
జానపదం రూపకం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 లలిత సంగీతం, పద్యపఠనం
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 వాద్య బృందం
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు,
6.30 పంటసీమలు
విస్తరణోద్యోగులకు హెచ్చరిక
యువరక్షకులకు వ్యవసాయశిక్షణ
మార్కెట్టు ధరలు
జానపద గేయము
సాంద్రవ్యవసాయములో ట్రాక్టర్లు
వాతావరణ వివరాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 రాజర్షి రాజేంద్ర ప్రసాద్ ప్రసంగం (హైదరాబాద్‌నుండి రిలే)
7.30 రాష్ట్ర వికాసవేదిక (హైదరాబాద్‌నుండి రిలే)
7.45 పల్లాండు పల్లాండు నాటిక
రచన: వి. శివరామారావు
8.00 కల్పలత-
శ్రోతలు కోరినపాటలు†
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 లలిత సంగీతం†
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 In the News
9.20 విరామ సంగీతం†
9.30 అఖిలభారత సంగీత కార్యక్రమము
మొహమ్మద్ సాగిరుద్దీన్ ఖాన్: సారంగి
అజామత్ హుస్సేన్‌ఖాన్: గాత్రం (ఢిల్లీనుండి రిలే)
11.00 ఆంగ్లములో వార్తలు
11.05 ప్రసార సమాప్తి, జనగణమన

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

ooooooooooooooooooooooooo

# గురువారం డిసంబర్ 15

శక 1888 అగ్రహాయన 24

ooooooooooooooooooooooooo

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరాలు
6.10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి
6.50 వాద్యగోష్ఠి : నిలయవిద్వాంసులు
7.00 తెలుగులో వార్తలు
7.15 విజయవాడ వలె
7.30 సంస్కృత పాఠము
7.45 సుగమ సంగీత్
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 విజయవాడ వలె
9.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 ఉన్నత పాఠశాలలకు
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

11.45* For Middle Schools (relay from Vijayawada)
12.30* కార్మికుల కార్యక్రమము
పాటలు†
పూర్వగాథలు: ధర్మవ్యాధుడు కథానిక
రచన: డి. సీతారామశర్మ
అభివృద్ధి నివేదిక
1.00 వనితావాణి (విజయవాడనుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రపథ్ సే†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, సుగమ సంగీత్ :
2.10 ఉర్దూలో వార్తలు
2.20 రసూలన్ బాయ్†
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 విజయవాడ వలె
5.50 బాలవిహార్ విజయవాడ వలె
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యవసాయిక విషయాలు
పాకేజి కార్యక్రమాల ప్రగతి ప్రసంగం
కోళ్లు-అంటువ్యాధులు: నివారణ చర్యలు: ప్రసంగం
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష (విజయవాడనుండి రిలే)
7.30 చతురంగం (విజయవాడనుండి రిలే)
7.45 రాగం, తానం, పల్లవి (విజయవాడనుండి రిలే)
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 "శాంతిపర్వం" సంగీతరూపకము-సుందరపాటలు
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 Debate (relay from Delhi)
10.00 భారత నౌకాదళ దినోత్సవంపై రూపకం
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 హిందీలో వార్తలు
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు శనివారములు మాత్రము

సా॥ 5-30 నుండి రాత్రి 11'10 వరకు

### విశాఖపట్నం

322.5 మీ (930 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై) (హైదరాబాద్ మాత్రమే)

6.00* హైదరాబాద్ ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని :
రంగరాజప్రబోధము
రామచంద్ర అష్టకము
రామనామం, శివనామం
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తి ముక్తావళి (హైదరాబాద్ నుండి రిలే)
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 మాలతీ పద్మనాభరావు
7.30 సంస్కృత పాఠము (హైదరాబాద్ నుండి రిలే)

ప్రసారము I (తరువాయి)

62.50 మీ (4800 కిలోసై)

8.00 హైదరాబాద్ ఎ వలె
9.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై) (హైదరాబాద్ మాత్రమే)

11.45 హైదరాబాద్ వలె
12.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12.30* హైదరాబాద్ ఎ వలె
1.00 వి. ఆర్. ధనం
1.30 హైదరాబాద్ వలె
2.10 వాద్య సంగీతం†
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

62.50 మీ (4800 కిలోసై)

5.30* హైదరాబాద్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ ఎ వలె
9.15 In the News (relay from Delhi)
9.20 విరామ సంగీతం (ఢిల్లీనుండి రిలే)
9.30 హైదరాబాద్ ఎ వలె
10.40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1200 కిలోసై) (వివిధభారతి రిలే)

[వివరాలు 48-వ పేజీలో]

7.45 సంగీత శిక్షణ దేశభక్తిగేయం
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 అల్లూరి వెంకయ్య: నాదస్వరం
9.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11.45 For High Schools
12.05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30 కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)
1.00 మాలతీ పద్మనాభరావు
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 గ్రామలక్ష్మి, బాలవిహార్
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 వాద్య బృందం
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 పంటసీమలు
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.30 చతురంగం
నౌకాదళ దినోత్సవము రూపకం
7.45 రాగం, తానం, పల్లవి
కె. అక్కాజిరావు: వీణ
8.30 Radio News Reel
8.30 చిత్రతరంగిణి
8.45 ప్రాదేశిక సుగమ సంగీత్
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 In the News
9.20 విరామ సంగీతం
9.30 ప్రకటించబడును
10.00 అల్లూరి వెంకయ్య: నాదస్వరం
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై) వివిధభారతి (రిలే)

[వివరాలు 48-వ పేజీలో]



✽ సమయ సూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

## గురువారం డిసెంబర్ 15

శక 1888 మార్గశిర 24

# మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 11-00 వరకు
మ॥ 11-55 నుండి 2-10 వరకు
సా॥ 5-30 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11-55 నుండి 2-10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6-45 సంగీతామృతన్: టి. వి. నమశ్శివాయం
7-15 తమిళములో వార్తలు
7-30 రాగం, తానం, పల్లవి: ఎస్. రాజం
8-15 ఎస్ కృష్ణమూర్తి తంబిరాన్
8-45 గీత మంజరి
9-15 రుక్మిణీ వెంకటాచలం
9-45 పన్నిరుతిరుమురై†
10-15 ప్రసంగం (తమిళం)
10-30 Educational broadcast English lesson for Standard VII conducted by C Mortimer
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ వార్తలు
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 పాఠశాలలకు (తమిళం)
1-00 రుక్మిణీ వెంకటాచలం
1-30 వాద్య గోష్ఠి
1-45 చిత్రగానం: తాయైకాత్త తనయన్
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* సంగీత మంజరి
5-45 రూపకం (తమిళం)
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 శెయిది కుతప్పుగళ్
6-20 చిత్రగానం
కుముదం, తొళిలాళి
కొంజుం సలంగై, వెన్నిరాడై
తిరువిళయాడల్
ఉల్లాస పయనం
6-45 ఎస్. కృష్ణమూర్తి తంబిరాన్
7-15 తమిళంలో వార్తలు
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 మణి కృష్ణస్వామి
వి. ఎల్. వేదగిరి: వయొలిన్
ఎమ్. ఎన్. కందస్వామి: మృదంగం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 పుస్తక సమీక్ష (తమిళం)
9-30 ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి [అక్టోబర్ 23-వ తేదీన ఐక్య రాజ్య సమితిలో జరిగిన సంగీత కచేరీ రికార్డులు]
11-30 Light classical variety†
11-55 ఆంగ్లములో వార్తలు
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I
211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ వలె
6-10 ఆంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత మంజరి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211.3 మీ (1420 కిలోసై)

11-55 మద్రాస్ ఎ వలె
1-00 For session†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 మహిళామండలి
స్త్రీల కార్యక్రమము
యువతీ సమస్యలు-వీటికి చట్టాలు అవసరమా?
యుక్త వయస్కు చర్చ
పాల్గొనువారు:
పి. శారదాంబ
జి. జలంధర
ఎమ్. శారద
జవాను-ఆహార రంగము
ప్రసంగం ఎమ్. సుశీలాదేవి
మంగళం
2-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211.3 మీ (1420 కిలోసై)
[5-30 నుండి 6-40 వరకు 60.98 మీటర్లపైగూడా]

5-30* Frida Lieder: Soprano†
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు, కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 వాద్య సంగీతం: వేణువు, వయొలిన్
7-30 University of the Air. Radio programme to supplement Correspdndence Course
8-00 U. N. Speaks
8-15 అంజలి
8-15 Radio News Reel (relay from Delhi)
8-45 వాద్యసంగీతం. గోటువాద్యం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 Debate (relay from Delhi)
10-00 The Indian Navy feature by Melville De Mellow
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

# మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

# బెంగుళూర్

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, మంగళధ్వని, సుప్రభాతం, విచారదీప్తి, వాతావరణ సూచన
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
6-10 బి. నాగేంద్రప్ప: క్లారినెట్
7-40 బజారు ధరలు
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 చిత్రగీతె†
8-50 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
(బెంగుళూర్ మాత్రమే)

12-30* బి. నాగేంద్రప్ప: క్లారినెట్
1-00 వాద్యశ్రీ†
1-10 కన్నడములో వార్తలు
1-20 సుగం సంగీత్†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 కావ్యవచన: హెచ్. వి. కోప్రేషాచార్
2-00* ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-20 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు, వాతావరణ సూచన (ఆంగ్లం)
6-10 గానామృత†
6-20 కావ్యవచన
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీత్†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 రూపకం (కన్నడం)
8-10 సుధావాణి
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 కన్నడ గీతావళి
8-50 Today in Parliament
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 వాద్యవృంద
9-30 Feature on the Indian Navy on the occasion of Navy Day written and produced by Melville De Mellow
10-00 మన వాగ్గేయకారులు: ధర్మపురి సుబ్బారాయర్ సంగీత రూపకం
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

# ప్రసంగములు

హైదరాబాద్

డిసంబర్ 4 ఆ॥ రా॥ 7-45 నేలపాయి రాపాడని ఆహారపదార్థాలు
ప్రసంగం
కె. గురుమూర్తి

„ 9 శు॥ రా॥ 9-30 నిర్వచనోత్తర రామాయణం
పాత్ర నిర్వహణ
ప్రసంగం
డా॥ బి. రామరాజు

„ 11 ఆ॥ ఉ॥ 7-30 భాషా సామరస్యం
ప్రసంగం
డి. రామానుజరావు

డిసంబర్ 12 సో॥ రా॥ 9-45 పెద్దనలో ప్రతిబింబించిన పూరన
ప్రసంగం
డా॥ పి. దుర్గయ్య

విజయవాడ

డిసంబర్ 4 ఆ॥ ఉ॥ 7-30 సుప్రసిద్ధులైన కొందరు నిఘంటు
కర్తలు: యజ్ఞని నిరుక్త
ప్రసంగం

„ 5 సో॥ రా॥ 9-45 సాహిత్యముపై వార్తాపత్రికల
ప్రభావము
ప్రసంగం

„ 6 మం॥ మ॥ 1-00 మారుతున్న మన సమాజపు
విలువలు-విద్యావిధానము
ప్రసంగం
వి. కోటీశ్వరమ్మ

„ 7 బు॥ రా॥ 7-30 వెండితెర-నాడు, నేడు, రేపు
ప్రసంగం
బి. ఎన్, రెడ్డి

మద్రాస్

డిసంబర్ 1 గు॥ మ॥ 1-00 మృగతృష్ణ-పుస్తకం చదివి-
[illegible] చేయడం
ప్రసంగం
కె. రామలక్ష్మి

„ 6 మం॥ రా॥ 7-15 రాబోయే ఎన్నికలు: ప్రజాస్వామ్య
ము-పార్టీల ఆవశ్యకత
ప్రసంగం
ఎమ్, సత్యనారాయణ

„ 8 గు॥ మ॥ 2-00 చిన్న సంసారం సౌఖ్యానికి ద్వారం
ప్రసంగం
వై. కల్పకం

„ 13 మం॥ రా॥ 7-15 ఏదీ వృథా చేయకండి
ప్రసంగం
ఎన్. ఆర్. చందూర్

# నాటికలు, రూపకములు

హైదరాబాద్

డిసంబర్ 4 ఆ॥ మ॥ 3-00 ఘోస్ట్స్ నాటిక
సమర్పణ: నండూరి విఠల్

„ 10 శ॥ రా॥ 7-45 మానవ హక్కులు రూపకం
రచన: అరవి

„ *12 సో॥ మ॥ 11-45 ఉత్తర గోగ్రహణము*
రూపకం
రచన: వేటూరి ఆనందమూర్తి

విజయవాడ

డిసంబర్ 3 శ॥ రా॥ 7-45 పల్లాండు పల్లాండు నాటిక
వి. శివరామరావు

„ 3 గు॥ రా॥ 10-00 నవశక్తి సంగీత రూపకం
రచన, సమర్పణ: కె. రామభద్రరావు

„ 11 ఆ॥ మ॥ 3-00 దేవనాంప్రియ నాటిక
రచన: కె. వి. ఆచార్య

మద్రాస్

డిసంబర్ 4 ఆ॥ మ॥ 2-00 మనోరమ నాటిక
రచన: డా॥ పి. వి. రాజమన్నార్

„ 7 బు॥ రా॥ 8-00 వైతరిణి నాటిక
రచన: అడపా రామకృష్ణారావు

„ 16 బు॥ రా॥ 8-00 బహువ్రీహి నాటిక
రచన: పి. గణపతిశాస్త్రి



టి. విశ్వనాథన్: వేణువు (రేడియో సంగీత సమ్మేళనం)

# సంగీత కచేరీలు

## హైదరాబాద్

| తేదీ | | వారం | సమయం | | కార్యక్రమం |
|---|---|---|---|---|---|
| డిసెంబర్ | 2 | శు॥ | రా॥ | 7-30 | టి. టి. సీత<br>పి. కుప్పుస్వామి వయొలిన్<br>ఎ. వెంకటేశ్వరరావు మృదంగం |
| .. | 4 | ఆ॥ | ఉ॥ | 8-30 | సంగీతామృతం<br>ఎమ్. ఎస్. గోపాలకృష్ణన్ వయొలిన్ |
| .. | 8 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి:<br>మారెళ్ళ కేశవరావు. వయొలిన్<br>కోలంక వెంకటరాజు. మృదంగం<br>ఎస్. వెంకటరమణ ఘటం |

## విజయవాడ

| తేదీ | | వారం | సమయం | | కార్యక్రమం |
|---|---|---|---|---|---|
| డిసెంబర్ | 1 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి<br>వోలేటి వెంకటేశ్వర్లు<br>డి. పాండురంగరాజు: వయొలిన్<br>యెల్లా సోమన్న: మృదంగం |
| .. | 9 | శు॥ | రా॥ | 7-30 | డి. పాండురంగరాజు<br>అన్నవరపు రామస్వామి. వయొలిన్<br>కె. హనుమంతరావు: మృదంగం<br>ఎ. గోపాలం: ఘటం |
| .. | 11 | ఆ॥ | రా॥ | 9-45 | వెలిది సుబ్బారావు. వేణువు<br>ఎన్. సిహెచ్. కృష్ణమాచార్యులు: వయొలిన్ |

## మద్రాస్

| తేదీ | | వారం | సమయం | | కార్యక్రమం |
|---|---|---|---|---|---|
| డిసెంబర్ | 1 | గు॥ | రా॥ | 8-00 | సి. సరోజ, సి. లలిత<br>ఎ. సుబ్బయ్య. వయొలిన్<br>పాల్ఘాట్ కె. కుంజుమణి. మృదంగం<br>ఆర్. ఎస్. కృష్ణమూర్తిరావు ఘటం |
| .. | 4 | ఆ॥ | ఉ॥ | 8-15 | లలితా భాను<br>టి కేశవులు వయొలిన్<br>తంజావూరు నారాయణస్వామి పిళ్లై: మృదంగం |
| .. | 6 | మం॥ | ఉ॥ | 7-30 | టి. బృంద, టి. ముక్త<br>ఆర్.కె. వెంకట్రామశాస్త్రి: వయొలిన్<br>తంజావూరు ఎమ్. శివప్రకాశం: మృదంగం |
| .. | 8 | గు॥ | రా॥ | 8-00 | మదురై టి. వెంకటేశన్<br>వి. సేతురామయ్య : వయొలిన్<br>మద్రాస్ ఎ. కన్నన్: మృదంగం<br>కె. నారాయణస్వామి: ఘటం |
| .. | 9 | శు॥ | ఉ॥ | 9-15 | లాల్గుడి జి. జయరామన్ వయొలిన్<br>ఉమయాల్పురం కె. శివరామన్ మృదంగం<br>ఆలంగుడి రామచంద్రన్ ఘటం |
| .. | 10 | శ॥ | ఉ॥ | 8-00 | ఎ. ముత్తయ్య వీణ<br>కువీంద్రం కృష్ణన్ మృదంగం |
| .. | 11 | ఆ॥ | ఉ॥ | 8-15 | టి కె. గోవిందరావు<br>టి కేశవులు వయొలిన్<br>కె. నారాయణస్వామి: ఘటం |
| .. | 12 | సో॥ | ఉ॥ | 7-30 | మదురై మణి అయ్యర్<br>వి. గోవిందస్వామి నాయకర్ వయొలిన్<br>ఉమయాల్పురం కె. శివరామన్: మృదంగం |
| .. | .. | .. | రా॥ | 9-45 | రాగం, తానం, పల్లవి<br>ఎమ్. ఎస్. కల్యాణకృష్ణ భాగవతర్: వీణ<br>కోయంబత్తూర్ ఎన్. రామస్వామి: మృదంగం<br>ఆర్. ఎస్. కృష్ణమూర్తిరావు ఘటం |
| .. | 13 | మం॥ | రా॥ | 9-15 | అయ్యలూర్ కృష్ణన్ |
| .. | 15 | గు॥ | రా॥ | 9-30 | ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి, బృందం |

## బెంగుళూర్

| తేదీ | | వారం | సమయం | | కార్యక్రమం |
|---|---|---|---|---|---|
| డిసెంబర్ | 1 | గు॥ | రా॥ | 9-30 | ఎ. వి. కృష్ణమాచార్: వయొలిన్<br>ఎమ్. ఎస్. రామయ్య: మృదంగం<br>ఎన్. ఎల్. సీతారామశాస్త్రి: ఘటం |
| .. | 4 | ఆ॥ | ఉ॥ | 8-30 | రుక్మిణీ పుష్పవనం<br>సుశీలా దేశికన్ వయొలిన్<br>ఎమ్ అనంతస్వామి: మృదంగం |
| .. | 7 | బు॥ | రా॥ | 9-55 | సంధ్యావందనం శ్రీనివాసరావు<br>వి. ఎల్. వేదగిరి: వయొలిన్<br>పాల్ఘాట్ కె. కుంజుమణి మృదంగం |
| .. | 11 | ఆ॥ | ఉ॥ | 8-30 | వి. వెంకటసుబ్బారావు: వీణ<br>ఎమ్. ఎస్. రామయ్య మృదంగం |

## తిరుచ్చి

| తేదీ | | వారం | సమయం | | కార్యక్రమం |
|---|---|---|---|---|---|
| డిసెంబర్ | 2 | శు॥ | రా॥ | 9-45 | పి. ఎస్. వీరుస్వామి పిళ్లై: నాదస్వరం |
| .. | 6 | మం॥ | రా॥ | 9-15 | కుంభకోణం రాజమాణిక్యం పిళ్లై: వయొలిన్ |
| .. | 14 | బు॥ | రా॥ | 9-45 | ఇంజిక్కుడి ఇ.పి. కందస్వామిపిళ్లై: నాదస్వరం |

# గృహిణులు - కర్తవ్యాలు

ఏ. సరోజినీదేవి

స్త్రీ జీవితంలో ఎక్కువ కాలం గృహిణిగానే గడచిపోతుంది. "ఆడపిల్లంటేనే — వాళ్ళపిల్ల అని అర్థం" అంటూ పెద్దలు చెపుతూ వుంటారు. అసలు ఆడపిల్ల పుట్టుకే ఏ కొద్దియిళ్ళల్లో తప్ప ఒకవిధమైన నిస్పారం, ఆ సంఖ్య పెరుగుతున్న కొద్దీ తల్లిదండ్రుల బాధ చెప్ప నలవికాదు.

ఆమెను పెంచి పెద్దచెయ్యడం, ఆపైన పెళ్ళి, తరువాత ఆమె అత్త వారింట సాధక బాధకాలు, తల్లి తండ్రులకు వారున్నంతకాలం తీరని వ్యథ. తల్లితండ్రుల్లేని ఆడపిల్లల సంగతి ఒక్క భగవంతునికే ఎరుక.

భర్త అనుకూలమైనప్పుడు ఆమె అన్నికష్టాలు మర్చిపోతుంది. తన యిల్లే స్వర్గసీమగా, ఆ సీమలో తన భర్త ఓ ఆరాధ్యదైవంగా ఎంచు కుంటూ యుగమొక క్షణంగా కాలం గడుపుతూ, సమాజంలో ఓ అదృష్ట దేవతలా పేరొందుతుంది.

### భర్తల మనస్తత్వం

ఒక్కొక్క దాంపత్యంలో, వారు అనుకున్నది ఒకటి, అయినది వే రొకటి అవుతుంది. తప్పనిసరై తప్పించుకోలేక యింట్లో జరిగే ప్రతి చిన్నవిషయాన్నీ భర్త గోరంతవి కొండంతలు చేస్తూ భార్యను రాచి రంపాన పెట్టడం, ఆ బాధకు తట్టుకో లేక, ఆమె ఆత్మహత్యకో గురి కావడం అప్పుడప్పుడు చూస్తున్నాం.

భర్త కొంచెం మంచిమనసుతో యోచించి భార్య తనకెలా వుండాలని తోస్తే అలా అనుభవించుకోగల్గితే సగం బాధలు సమసిపోతాయి. అలా అనుభవించుకొని, వున్న భార్యతోనే తృప్తిపడి, ఆమె తన సర్వస్వంగా ఎంచుకొనే భర్త లేకపోలేదు. నిజానికి అతను మానవుడే కాదు; గొప్ప మహానుభావుడు కూడా. అలాంటి భర్తకు భార్య జన్మజన్మాలకు ఋణ పడి వుంటుంది.

ఒక్కొక్కసారి, సంసారాల్లో వచ్చే గొడవలు భర్తమూలంగానే రావు. వివిధ పాత్రధారులు వుంటూ వుంటారు. వారిలో ఏ దుష్టశక్తో ప్రవే శించి, ఆ సంసారాన్ని చిన్నాభిన్నం చేసిగాని వదలిపెట్టదు. అలాంటిదాన్నే 'శని' అని మనం అనుకుంటూ వుంటాం. ఎందుకంటే మనం ఆ దుష్టుల్ని ఏమీ చెయ్యలేము గనుక.

### అత్తా, ఆడబిడ్డలు

ముఖ్యంగా భర్తతరువాత, అత్త, ఆడుబిడ్డల మన్ననకూడ స్త్రీ సుఖ జీవనానికి తోడ్పడుతుంటుంది. కోడల్ని సరిగా అర్థంచేసుకొని, కోడలూ హితురాలంటిదే అనే అత్తగార్లు చాల తక్కువమంది వున్నారు. సభ్యతా సంస్కారంలేని కుటుంబాల్లో, అత్త తాను ఎప్పుడో కోడలుగా పడ్డ కష్టా లను నేడు తన కోడలుకూడ అనుభ వించడం తప్పనిసరి అనుకుని పెత్త నం చలాయించ చూస్తుంది.

నిజానికి దంపతులమధ్య తగాదా లకు మూలం అయినవారు ఎంత దగ్గరవారైనా ఉభయులకు దూరంగా వుండడం శ్రేయస్కరం.

కాస్త పేదకుటుంబంగా వుండి, కోడలు వచ్చాక అదృష్టం కలసివస్తే, ఇరుగుపొరుగువారు వూరికే వుండలేక "మీ కోడలు వచ్చాక మీ రోజులు మారాయి! నిజంగా దాని అదృష్టం, దాని పిల్లల అదృష్టం" అన్నారంటే, ఆరోజు అత్త ఆడుబిడ్డలు ఆ పొగ డ్తను భరించలేక ఒక్కటైపోయి దానికి చిలవలు పలవలు అల్లితే సన్న జల్లుగా ప్రారంభమై ఆ సంసారంలో కారుచీకటి అలుముకుని, రెండు తుఫాన్లు, మూడు భూకంపాలు, నాలుగు ప్రపంచయుద్ధాలు జరిగినంత పనవు తుంది.

పొరపాటున కొడుకు కోడలు పక్షం వహించాడా భార్యకు లొంగి పోయాడనీ, అది దాసుణ్ణి చేసుకుందనీ యింకా యింకా అనేకం వినవలసి వస్తుంది. అందువల్ల తెలివిగల మగ వారు కొందరు అలాకాకుండా, భార్య అంటే సర్వహక్కులతో సంపా యించుకున్నదేగా అనుకొని, కారణం విచారించే ఓపికలేక, తమ కుటుం బంలో తాను మంచివాడుగా పేరొందా లని, భార్యపై నోరుచేసుకొని, అవ సరమైతే చెయ్యికూడ చేసుకోవడం జరుగుతుంటుంది.

### గోడలకు చెవులు

ఆపైన భర్త పడకగదిలోనైనా ఆమెను సముదాయించడానికి వీలుం డదు. గోడలకు చెవులుండవచ్చు: ఒకవేళ భార్యకు క్షమాపణ చెప్పు కొనడం, వారికి చిన్నతనం కావచ్చు. తమ వ్యక్తిత్వానికది తీరని బాధ కావచ్చు. అందువల్ల అదే లొంగిరాక ఎక్కడికి పోతుంది. అనుకునేలోపల, భార్య తనకు తీరని అన్యాయం జరి గింది అనుకుని ఏ ఉపద్రవానికో గురి కావచ్చు.

ఇలా ప్రతి చిన్న విషయాన్ని భరించలేనిదిగా చిత్రించుకుంటూ కొంతమంది స్త్రీలు తమ జీవితాన్ని త్యజించడం జరుగుతోంది. ఆపైన సాధించగల్గేదేముంది.

స్త్రీలు సమానహక్కులు ఇవి విన డానికి, అధ్యయనం చెయ్యడానికి ఎంతో బాగుంటాయి. కాబట్టి మన కర్తవ్యాన్ని మనమే, గుర్తించి మెల గడం మంచిది.

### కష్టసుఖాలు

ముఖ్యంగా చెప్పవలసి వస్తే స్త్రీలే, స్త్రీల కష్టసుఖాలకు బాధ్యులౌతు న్నారు. ఏది ఏమైనా స్త్రీకి, స్త్రీకి, మధ్య కంటికి కంటికి వున్నంత అవినాభావ సంబంధం వున్నప్పుడే స్త్రీ జీవితం సంతోషదాయకమౌతుంది.

ఒక్కొక్క పురుషుడు భార్యని కాదని పరస్త్రీలను వాంఛించడం, అదో పెద్దఘోరంగా తలపోసి "చస్తే యీ బాధే సమసిపోతుందని" భార్య నికృష్టమైన చావు కోరుకోవడం జరుగుతుంది. నిజమే మరి. స్త్రీ జీవి తంలో యితరులకు ఏదైన సమ ర్పిస్తుంది కాని, చూస్తు చూస్తు తన ప్రియదైవాన్ని యితరులకు అప్పగించి వూరుకుంటూందా ? లేదు.

కాని ఊరుకోవాలి. తప్పదు. నిత్య జీవితంలో ఎన్నో ఒదులుకుంటున్నాం. అలానే యిదికూడ అనుకోండి. అప్పుడు మనస్సు ఎంతో కుదుటబడు తుంది. గొప్ప శాంతి లభిస్తుంది. అంతకంటే మనం చెయ్యగల్గిందేదీ లేదు.

### సమాజ గౌరవం

భార్యలో అందం లోపించవచ్చు, వాక్చాతుర్యం లేకపోవచ్చు. విజ్ఞాన

[తరువాయి ప్రక్క పుటలో]



మెట్టా లక్ష్మి వెంకటేశ్వరరావు: కుటీర పరిశ్రమలు అను విషయంపై పరిచయ కార్యక్రమము (ఇటీవల విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము)

# విదేశీ మారకం నిలపకు స్వదేశీ మార్గం

పందిరి మల్లికార్జునరావు

ఒకప్పుడు స్వదేశీ అనే పదం ఎక్కువగా వినబడుతూ ఉండేది. ఏ పత్రికలో చూచినా, ఏ ఉపన్యాసం విన్నా స్వదేశీ అనేమాట ఎన్నిసారులు దొర్లుతూ ఉండేదో, స్వదేశీ ఆచారవ్యవహారాలూ - ఒకటేమిటి? అంతా స్వదేశీ మయంగా కనబడేది. వెలుగు వెంటే నీడ ఉండేటట్లు స్వదేశీతోబాటు విదేశీ వస్తువులు, విదేశీ ఆచారవ్యవహారాలు, విదేశీచదువులుకూడా వినవస్తూఉండేవి. విదేశీ వస్తుబహిష్కరణ, స్వదేశీవస్తు స్వీకరణ మొదలయిన దీక్షా కార్యక్రమాలు ఆచరించడం-అనాటి ప్రతి భారతీయుని కర్తవ్యం, ధర్మమూను, స్వదేశీ వస్త్రధారణ చేయనివారందరూ దేశానికి శత్రువులే, ద్రోహులే, అంత ప్రబలంగానూ, ప్రగాఢంగానూ ఉండే నమ్మకాలపట్ల యీనాడు మనం అలక్ష్యంగా చూస్తున్నాం. అనవసరమని భావిస్తున్నాము.

## దృక్పథంలో మార్పు

కానైతే, ఇది ఎంతవరకు సమంజసం అని మనం కొంచెం ఆలోచించాలి. ఆనాడు పవిత్రం అనివార్యం అనుకొన్న భావాలతో యీరోజున ఇటువంటిమార్పు వచ్చినదంటే దానికి కారణం ఏమయి ఉండాలి? పరిస్థితిలో మార్పులవల్ల యీనాడు ఇటువంటి అభిప్రాయాలు కలుగుతున్నాయా? లేక ఆనాడు మనమేదో పొరబాటుచేశామని తెలిసికొని, యీరోజున దానిని సరిదిద్దుకొంటున్నామా? ఈ రెండు కారణాలూ కావని వేరేచెప్పనక్కరలేదు. మన దృక్పథంలో మార్పురావడమే దీనికి కారణం. దీనిని సరిగా అవగాహన చేసికోవాలంటే పూర్వం జరిగిన విషయాలను కొంత నెమరుకి తెచ్చుకోవాలి.

ఆంగ్లేయులు మన దేశానికి రాకముందు స్వదేశీ అనే ప్రసంగం లేదని చెప్పవచ్చు. ఇంగ్లీషువారు మన దేశానికి వర్తకానికి అంటూవచ్చి, మెల్లిగా రాజ్యం స్థాపించారు, అధికారం చెలాయింపసాగారు. ఇంగ్లీషుభాష, ఇంగ్లీషువారి ఆచారవ్యవహారాలుకూడా మన దేశంతో వ్యాప్తినొందసాగాయి. రాజులు ఇంగ్లీషువారే కనుక ఇంగ్లీషుభాష రాజభాష అయికూచుంది. ఇంగ్లీషు చదువుకొన్నవారే విద్యాధికులుగా పరిగణింపబడేవారు. ఇంగ్లీషునేర్చినవారికే ఉద్యోగాలు. ఇంగ్లీషు రానివారు ఛాందసులు, తెలివి తక్కువవారు గానూ లెక్కింపబడేవారు. దానితో పరాయి దేశంనుంచివచ్చిన కొత్తసంస్కృతికీ, మన సాంప్రదాయబద్ధమయిన ప్రాచ్య సంస్కృతికీ సంఘర్షణప్రారంభమయినది. ఈ ఒరిపిడితో భారతజాతి మేల్కొన్నది. మరల ప్రాచ్యచదువులు, మన దేశీయమయిన ఆచారవ్యవహారాలుపున రుజ్జీవితం కావాలనే భావాలు బలం పోసుకొన్నాయి.

## స్వదేశీ ఉద్యమం

దీనికితోడు ఆనాటి ఆంగ్లేయులు భారతీయులను, భారతీయ సంస్కృతినీ యీసడింపుతోనూ అవహేళనతోనూ చూడడంవల్ల నిద్రపోతున్న భారతీయాత్మ చైతన్యవంతమయినది. 1857 సంవత్సరంలో జరిగిన సిపాయిల కలహమని చెప్పబడే మొదటిస్వాతంత్ర్య యుద్ధానికి ఇదే బీజరూపమయిన కారణాలు. మన దేశాన్ని మనమే పరిపాలించుకోవాలనీ, భారతభూమితో పరాయివారికి అధికారం ఉండకూడదనీ - మొదలయిన భావాలు బలాన్ని పుంజుకోసాగాయి. కానైతే, అప్పుడు స్వాతంత్ర్యం లభింపలేదు. మరల 1905 లో ప్రభల్లిన స్వరాజ్యోద్యమం స్వదేశీ ఉద్యమానికి ప్రారంభంఅని చెప్పవచ్చు 1908 సంవత్సరం నాటి వందేమాతరం రోజులువచ్చేటప్పటికి స్వదేశీ ఉద్యమం రూపుకట్టుకొని, ఒక బలవత్తరమయిన ఉద్యమంగా పరిణామం పొందినది. బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయి, బాలగంగాధర తిలక్

[పక్క పుట తరువాయి]

విహీనురాలు కావచ్చు. లేదా ఆమె కళ్ళలో అతడికి కావలసిన ఆకర్షణ లోపించవచ్చు. ఇంకా అనేకం వుండవచ్చు. అలాంటివి సమర్పించగల స్త్రీ శ్రీవారికి ప్రియురాలు కావచ్చు. కాని భార్యకాలేదుగా.... యీ ఒక్కటే భార్యకు "శ్రీరామరక్ష". "ఫలానా ఆమె ఎవరు?" "ఫలానా ఎల్లయ్యగారి భార్య" అంటుంది సమాజం. "సంఘం శరణం గచ్ఛామి" సమాజం గౌరవించడం ముఖ్యంగా మనకు కావలసింది. ప్రియురాల్ని గౌరవించేది ఒక్క ప్రియుడుమాత్రమే. అలాంటి ప్రియురాలిపై క్రోధం పూని అతని భార్య చావు కోరుకోడం వర్తి వెర్రి బాగులతనం.

తన భర్త. యింటిని, ఇల్లాల్ని, మర్చిపోనంత కాలం భార్య అతనిపై ఎలాంటి నిబంధనలు విధించకూడదు. ఇంటి యజమాని ఎక్కడుంటే అక్కడే ఆమె యిల్లు. మిగతావన్నీ వట్టి అనామకాలు మాత్రమే—

ఇది గుర్తుంచుకొని భార్య గర్వంగా జీవించవచ్చు.

## మాతృమూర్తి

ఒక వయస్సు వస్తుంది. అప్పుడు భర్త కంటికి భార్య, భార్యగానేకాదు; మాతృమూర్తిగా, ఓ గొప్ప వెల్గులా గోచరిస్తుంది. ఆ సమయములో వారికి శ్రీమతిపై ఎనలేని ప్రేమాభిమానాలు ఉద్భవిస్తవి. అప్పుడు గతానుభూతులు కాలగర్భంలో కలిసిపోతాయి. ఒకర్ని వీడి ఒకరు వుండలేరు. భారతగృహిణి తరతరాలనుండి అనుశృతంగా వస్తున్న ఆదర్శాల వరవడిలో "మీ కంటిముందు నేను రాలిపోవాలని వుంది" అంటుంది భర్తతో. ఆ ముదుసలి భర్త హృదయాంతరాంతరాల్లోంచి "ఎక్కడికమ్మా, నన్ను వీడిపోతావు, నేనుపోతే నీకు ఒక్క పసుపుకుంకుమే లోటు, నీవే లేకపోతే నేనే లేను." 'గనుక మనమిరువురము ఒకేసారి వెడదాము' అంటూ ఆక్రోశిస్తుంది ఆ ముసలి హృదయం.

ఇంతటి సుదీర్ఘయాత్రను చేతులారా త్రుంచుకొని గృహిణి మధ్యలోనే మాసిపోతే యెలా? బ్రతకాలి. స్త్రీకోసమే స్త్రీ బ్రతకాలి. ఉత్కృష్ట స్థానాన్ని అపాదించుకొని స్త్రీ తన జన్మ చరితార్థం చేసుకోవాలి. ఆదర్శ గృహిణిగా తన కర్తవ్యాన్ని గుర్తుంచుకొని జీవితనౌకను ఆవలి ఒడ్డుకు చేర్చాలి.



టి. బృంద, టి. ముక్త (మద్రాస్, డిసెంబర్ 6)

మొదలైన రాజకీయ నాయకులు దేశం నలుమూలలా సంచారంచేసి స్వరాజ్యోద్యమంతోబాటు స్వదేశీ ఉద్యమాన్ని కూడా బాగా వ్యాప్తిలోకి తీసికొని వచ్చారు.

అప్పటి నుంచి దేశభక్తులయిన కొంతమంది స్వదేశీపరిశ్రమలకై ఉద్యమించడం, చిన్న చిన్న వస్తువులను తయారుచేయడం దేశభక్తులు వాటిని ఉపయోగిస్తూ ఉండడం జరిగినది. తలనూనెలు, సెంట్లు, సబ్బులు, పండ్లపొడి. సుద్దకణికలు-మొదలయినవి ఆ రోజులలో వచ్చిన పరిశ్రమల ఫలితమని చెప్పాం. ఓదేశీనూలుతో స్వదేశీ మగ్గాలమీద తయారయే బట్టలు కూడా స్వదేశీవిగానే భావింపబడుతూ ఉండేవి.

## గాంధీ యుగం

ఈ స్వదేశీ ఉద్యమం వెనుకనున్న భావాలు ఏమిటా అని కొంచెం ఆలోచించుదాం. పరాయిదేశాలకుమనడబ్బుపోకూడదనే భావం అందులో ఒకటి, అంతేకాకుండా, పరాయి పరిపాలన వల్ల, పరాయి సంస్కృతికిపట్ల ఉంటే అలిష్టభావమే ప్రబలమయిన కారణం అయి ఉండవచ్చు. 1920 వ సంవత్సరంలో మహాత్మాగాంధిగారు రాజకీయ రంగంలోకి రావడంతోబాటు భారత రాజకీయ ప్రవాహం కొత్తదారిని నడిచింది. చడిని చేకూర్చుకున్నది. వందేమాతరం రోజులలో జనించిన స్వదేశీ ఉద్యమం గాంధీజీఉద్యమంనాటికి బట్ట కట్టనేర్చినదని చెప్పవచ్చు. సహాయ నిరాకరణ ఉద్యమాలతో త్రివిధ బహిష్కారం ప్రధానకార్యక్రమం. అందు లో స్వదేశీఉద్యమం ఒకటి ప్రధానమయినది. స్వదేశీవస్తుస్వీకరణ, స్వదేశీ వస్త్రధారణలో ఖద్దరుధారణ చాలా ప్రాముఖ్యం వహించినది. భారతదేశంలో తయారయిన బట్టలయినా, అవి మిల్లులో తయారయితే త్యాజ్యాలే. కేవలం చేతిరాట్నంమీద తీసినసూలుతో, చేతిమగ్గాలమీద తయారయిన ఖద్దరు వస్త్రాలే దీక్షావస్త్రాలుగా పరిగణింపబడసాగాయి.

అంటే గాంధీమహాత్మునిరోజులలో స్వదేశీ పదానికి కొత్తఅర్థం ఏర్పడినది, కొత్తపరిభాషవచ్చింది. గాంధీ మహాత్ముని ఉద్యమం పాశ్చాత్య యంత్ర విధానానికీ ప్రతికూలం. ఆనాటి స్వదేశీ ఉద్యమంలో యీవిధమయిన భావం ప్రస్ఫుటంగా ప్రతిబింబించినది. అంతేకాకుండా, ఇంకొకకారణం కూడా ఉన్నది విదేశీవస్తుబహిష్కరణ ద్వారా స్వరాజ్యంరాగలదని నమ్మకం మరియొకటి, అయితే వందేమాతరం రోజులలోని స్వదేశీ ఉద్యమానికీ, గాంధీజీనాటి స్వదేశీఉద్యమానికీ ఒక తేడా ఉన్నది, వందేమాతరంనాటి ఉద్యమంతో పరాయి ప్రభుత్వంఅంటే ఏవగింపుఉంటే, గాంధీజీనాటి ఉద్యమంలో పాశ్చాత్య సంస్కృతిపట్ల ఉండిన వైముఖ్యం కనబడుతుంది.

ఏమయితేనేమి? గాంధీజీ నాయకత్వంతో విదేశీవస్తు బహిష్కరణకు కంకణం కట్టుకొని త్యాగాలు చేసిన భారతజాతి నేడు విదేశీవస్తువులపట్ల వ్యామోహాన్ని చూపుతూ ఉంది అని అంటే ఏదో మార్పువచ్చి ఉండాలి ఏమిటామార్పు? మనకు స్వాతంత్ర్యం లభించడమేకాని, వేరేకాదని చెప్పవచ్చు

## విదేశీవస్తువులపై వ్యామోహం

1947 లో ఆంగ్లేయ ప్రభుత్వం తొలగిపోయి, భారతీయ ప్రభుత్వం ఏర్పడినది, అతిక్లిష్ట పరిస్థితులలో మనకు స్వరాజ్యం సిద్ధించినది. ఏలాగయితేనేమి-నిలతొక్కుకొని భారత జాతి ముందడుగుచేస్తూఉన్నది. దేశంలోని నిరుద్యోగసమస్య, దారిద్ర్యం, ఆహారపదార్థాల కొరత ఇంకా ఎన్నెన్నో సమస్యలను తీర్చడానికి భారత దేశంలో కొత్తకొత్తపథకాలు నిర్మింపబడుతూ ఉన్నాయి. ఎన్నోపరిశ్రమలు స్థాగింపబడుతూ ఉన్నాయి. ఎన్నో ప్రాజెక్టులు ఎమునకి వస్తున్నాయి. అందేభారతజాతిస్వయంసమృద్ధిం గావడానికీ, పారిశ్రామికంగా పురోభివృద్ధి కలగడానికీ అవిరళకృషిచేస్తూఉన్నది. శైశవంలో ఉన్న మన పరిశ్రమలకు పరదేశాలమీద ఎంతో ఆధారపడవలసి ఉంటుంది, దానికి డబ్బుకావాలి. ఏదీ అంత డబ్బు మనదగ్గర? అటువంటి సందర్భంలో విదేశీమారకంలో తీవ్రమయిన కొరతఏర్పడినది. కాబట్టి, మనకు అత్యావసరమయిన వస్తుసామగ్రినే మనం దిగుమతి చేసుకోవలసి ఉంటుంధి అందువల్ల నిత్యజీవితంలో మనకు కావలసిన వస్తువులు ఎన్నో మనందిగుమతిచేసికోవడానికి అవకాశం ఉండదు, కావున, దీనికిమార్గంఏమిటి? అంటే మరియొకసారి మనం స్వదేశీ దీక్షాబద్ధులు కావాలి. ఈకాలానికి అనుగుణంగా మనం ఆవిధానాన్ని మలచుకోవాలి. దేశంలో తరహా తరహాలయిన వస్తువులను తయారు చేయడానికి పూనుకోవాలి. కొత్తకొత్త పరిశ్రమలను నెలకొల్పాలి, అంతేకాని, విదేశీ వస్తువులమీద వ్యామోహాన్ని కలిగి ఉండకూడదు

## భావదాస్యం

పైగా-మనదేశీయ పరిశ్రమల పరిస్థితి 30,40 ఏండ్లకు ముందు ఉన్నట్లు యీనాడు లేదు కొన్నికొన్నివస్తువులు విదేశీవస్తువులకు దీసిపోవు సరికదా, వాటికంటె ఎంతో మిన్నగా ఉంటున్నాయి అంతేకాని, భావదాస్యంలో పడి మనదేశంలో తయారయిన వస్తువులను చులకనగా చూడడం. ఇతర దేశాలనుంచి వచ్చినవే నాణ్యమయిన వని భావించడం మన భావదాస్యానికి తార్కాణమేమో మనకు రాజకీయంగా స్వాతంత్ర్యం లభించినా, భావదాస్యం తొలగకపోతే విముక్తి ఉండదు. స్వాతంత్ర్య సముపార్జనతోబాటు ఏర్పడిన భారత ప్రభుత్వాన్ని పటిష్టంచేయాలి భారతదేశంఆర్థికంగా పరిపుష్టిని చేకూర్చుకోవాలి, ఇందుకై భారతీయులందరు మరియొకసారి స్వదేశీ దీక్షాబద్ధులు కావాలి. విదేశీమారకం నిలువకు స్వదేశీదీక్షావలంబన-పరిష్కారమార్గం కావాలి.



ఎస్. నాగభూషణం పంచాయతీ రాజ్యం అను విషయంపై ప్రసంగం (ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితము)



సంధ్యావందనం శ్రీనివాసరావు.
(మద్రాస్, డిసంబర్ 5)

## పారిజాతాపహరణం

[4వ పేజీ తరువాయి]

ఆ కోపంతో ఆయన చిన్నాదేవి ఇంటివైపైనా రావడం మానారు రాజుగారు. రోజులు దాటుతున్నాయి. వారాలు పోతున్నాయి. నెలలూ గడుస్తున్నాయి కాని ఆయన మనసు మళ్ళలేదు. చిన్నాదేవి యీ విరహబాధతో కుమిలిపోయింది. జరిగిన పొరబాటుకు పశ్చాత్తాపపడింది. చెంపలువేసుకొని చెప్పుకొందామన్నా ఆయన రారాయె. అయినవారితో చెప్పుకొని సలహా అడుగుదామన్నా ఇది దాంపత్య రహస్యమైనందునా, సిగ్గొకటీ ఆత్మాభిమానమొకటీ అడ్డుపడడంవల్లా ఆవిడ ఎవరితోనూ చెప్పుకోలేకనూ పోయింది. చివరకు తెగించి, పుట్టినింటి ఆత్మీయుడు కదా, ఇది అంతా మనసులోనే పెట్టుకొని మంచి మనసుతో మార్గమేమైనా చూపుతాడేమోనని తిమ్మన్నగారితో తిన్నగా చెప్పుకొంది. ఆయన మహా మమకారంతో చాలా జాలిపడ్డాడు. రాయలవారి కోపం తీర్చడానికీ, చిన్నాదేవివేపు ఆయనను మళ్ళీ సుముఖంగా చేయడానికీ మార్గమేమిటా అని తిమ్మన చాలా దీర్ఘాలోచనలు చేశాడు. చేయగా చేయగా ఉన్నదున్నట్లు ఏమి తోచింతోగాని, ఏదో మంచిమార్గం తోచినట్లు తటాలున తేలికపడ్డాడు. తానూ తేరుకొన్నాడు.

ఫరవాలేదు, భయపడవద్దు. ఆయన మనస్సు ఇదిగో మళ్ళిస్తాను, చూడుమని చిన్నాదేవిని ఓదార్చాడు. అయితే తన పథకం ఆవిడకు చెప్పలేదు. ఇక, అదిమొదలుకొని ఆ పాచిక పారే ప్రయత్నంలో పడ్డారు. ఈ మహాకార్యానికి రాచమార్గం పనికిరాదనుకొన్నారు. రాయలవారికి హితబోధ చేసే ప్రత్యక్షపద్ధతి పనిచేయదని తీర్మానించుకొన్నారు. పరోక్షపద్ధతే ఏమైనా పనిచేస్తే, అనుకొన్నారు. పారిజాతాపహరణ రచన కుపక్రమించారు. అందులోనే రాయలవారికి పరోక్షంగా హితబోధ చేయాలనుకొన్నారు. యోచించి యోచించి, అందులో ఒకచోట, సమయం చూచుకొని, ఔచితి మీరకుండా సత్యాకృష్ణ ప్రణయకలహాన్ని ప్రవేశపెట్టారు. అందులో ఏదో తప్పుకుగాను సత్య కృష్ణుణ్ణి కాలితో తన్నడం, చేసిన తప్పును మన్నించమని కృష్ణుడు ఆవిడకాళ్ళు పట్టుకొని బ్రతిమలాడడం దాంతో సడీచప్పుడూ లేకుండా సత్యాకృష్ణుల ప్రణయకలహం చల్లారి, వారిద్దరూ యథాప్రకారం ప్రేమతో ఉండిపోవడం వర్ణించారు.

### పారిన పాచిక

క్రమేణా కావ్యం పూర్తిఅయింది. రాయలవారి విరామసమయం చూసుకొని, సదరకుండా బెదరకుండా, కావ్యమంతా రాయలవారికి వినిపించారు. అందులోనూ సత్యాకృష్ణుల ప్రణయకలహ ఘట్టాన్ని మరిమరీ నొక్కి ఒకటికి రెండుసార్లు వినిపించారు. స్వభావతః సరసుడైన రాయలవారికి ఆ అపూర్వ సన్నివేశంతో ఉన్నదున్నట్లు జ్ఞానోదయమైంది. ప్రణయకలహాల్లో పాటించవలసిన మామూలు సరసతనుకూడా కృష్ణుని లాగా, పాటించకపోయిన తన తప్పు స్ఫురించింది. తిమ్మనగారి పాచిక పారింది. ఆ జ్ఞానోదయానికే ఆయన యీ కావ్యం తలపెట్టిందీ, పట్టుపట్టి సత్యాకృష్ణుల ప్రణయకలహ ఘట్టాన్ని అందులో చొప్పించిందీని. తిమ్మనగారి యీ పథకం అప్పటికైనా రాయలవారికి తెలిసిందో లేదో గాని, తిమ్మనమటుకు తనంతట ఆ పథకం బయటపెట్టలేదు. రాయలవారికిమాత్రం బుద్ధివచ్చింది. కృష్ణుడంతటివాడా కాలితాపులు తినికూడా కోపపడకుండా, పైపెచ్చు కాళ్ళు పట్టుకొనగా మానవమాత్రుడు తాను ఆపని చేయలేకపోయానే అని చాలా మథనపడ్డాడు. పశ్చాత్తాపం పొందాడు. చిన్నాదేవివైపు మనసు మళ్ళింది. దంపతులు మామూలుస్థితిలో పడ్డారు. అనుకొన్నపని అక్షరాలా జరిగినందుకు తిమ్మనగారుకూడ చాలా సంతోషపడ్డారు. మహా ఘనకార్యం సాధించినట్టు సంబరపడ్డారు.

ఇందుకండీ తిమ్మనగారు అసలు పారిజాతాపహరణం రచిస్త. ఆయన కాపీరైటు కల్పనల్లో ఇదండీ అసలు సిసలైన కాపీరైటు కల్పన.





నాగార్జున కొండ శిల్పాలు (శిథిలముల చరిత్ర-నాగార్జునకొండపై రూపకమునుమాధ్యమిక పాఠశాలల కార్యక్రమములో విజయవాడ కేంద్రమునుండి డిసెంబర్ 2వ తేదిన వినవచ్చును.)

క్రొత్త మలుపు

కథావస్తువు మాత్రం యీ పారిజాతాపహరణానికి హరివంశం మూలమైతే కావచ్చుగాని, తిమ్మన ఆ కథావస్తువును ఔచితీమీరకుండా, తన చిత్తంవచ్చినట్లు మార్చి, కూర్చి, తన కల్పనలను రమ్యంగా మలిచారు, ఇంకొకరు అంత కమ్మగా దానిని మలచలేరు. ఆ మలపు ఆయనకే చెల్లింది.

పారిజాతాపహరణ రచనలో ఆయన చేపట్టిన ఎత్తుగడ ఆయన మరొక అద్భుత కల్పన. అనూచానంగా వస్తున్న ధోరణిని ఒక్కయెత్తున మార్చారు. ఎత్తుగడనే నాటక పద్ధతిలో ప్రవేశపెట్టారు. హుటాహుటిని పాత్రలను సూటిగా ప్రవేశపెట్టారు. కథారంగాలూ, స్థలకాలూ కూడ నాటకీయధోరణినే నడిపించారు, కావ్యకథ అంతా నాటక ధోరణిలోనే నడిచింది.

పాత్ర చిత్రణలోకూడ తిమ్మనగారు అపూర్వమైన కల్పనలు—అక్షరాలా ఆయన ముద్రగలవి—చూపెట్టారు. అందులోని పాత్రలోని మన యెదుట సాక్షాత్తూ తెరమీది కనిపిస్తున్నట్లు తద్రూపంగా కనిపిస్తారు. కావ్యం చదువుతున్నంతసేపూ, చదువుతున్నంతసేపే ఏమిటి, ఆ పాత్రలు ఆ తర్వాతకూడా చాలాకాలం మనకిండ్లకు కదుతూనే ఉంటాయి.

ఇక అలంకారాలను వాడడంలో కూడా ఆయన తన సొంతపద్ధతి అనుసరించారు. అత్యుక్తులూ అతిశయోక్తులూ ఆయనకు గిట్టవు. స్వభావోక్తులపైననే ఆయనకు ఎక్కువ మక్కువ. అందుచేత ఆయన వర్ణనల్లో స్వభావోక్తులూ, అందుకు దగ్గిరసా ఉండే ఉత్ప్రేక్షలూ, రూపకాలే బాహాటంగా కనిపిస్తాయి. అతిశయోక్తులు ఒకటి అలా ఎక్కడైనా ఉంటాయేమో గాని మొత్తంమీద తక్కువనే చెప్పవచ్చు.

పాత్ర చిత్రణ

అలనాటి పాత్రం మూలంగానే అప్పటికీ ఇప్పటికీ స్త్రీపురుషుల గుణవర్ణనలు అతికినట్లు అలాగే చూపెట్టారు. పాత్రల స్వభావాలు స్పష్టంగా ప్రదర్శించారు, ఇందులోనూ తిమ్మన తియ్యని, తిన్నని కల్పనలు బోలెడు కనిపిస్తాయి.

ఇందులోని రసం ప్రధానంగా శృంగార రసమే, తక్కినవన్నీ అనుషంగికంగా అరచాటుగా ఉంటాయి. శృంగార ప్రధానమైనదైనా అధాన శృంగారం, పచ్చిశృంగారం కలికాని కైనా ఎక్కడా కనిపించదు. రతిక్రీడాదుల ప్రసక్తిలేదు. స్త్రీల అవయవాల అసభ్యవర్ణనలుకూడా లేవు. స్తనవర్ణన మాత్రం ఒకటి రెండుచోట్ల ఉంది. అసభ్యంగాగాని, ఎబ్బెట్టుగాగాని; అశ్లీలంగాగాని లేవు. ఇటువంటి ఉదాత్త స్తనవర్ణనలు మన దేవదాస్తోత్రాలలోనూ వాటిలో ఉంటున్న బాపతు లోనే ఉన్నందున వీటిని పట్టి మనం పాటించనక్కరలేదు.

మొత్తంమీద తిమ్మన యీవిధంగా చక్కని, చిక్కని కవితా సంప్రదాయాలు పాటించడమే గాక ఇతరులకూ చూపెట్టారు.

తెలుగురసం

ఆయన కల్పనల్లో కొట్టవచ్చినట్టు కనిపించే అద్భుత కల్పన ఒకటి ముఖ్యంగా చెప్పాలి. కూచిపూడివారి ధర్మమా అని భామాకలాప రూపంగాను, ఇతర కావ్యకల్పన రూపంగానూ మనకు బాగా పరిచయమైన సత్యభామ బలే కోపన, తాపన. కాని అదే సత్యభామను తిమ్మన ఇందులో చూపెట్టిన తీరు అద్భుతంగా ఉంది. తిమ్మన సహృదయత యీ పాత్ర చిత్రణలో బాగా గోచరిస్తుంది. ఆవిడకు స్వభావంగా ఏర్పడ్డ ఆ కోపతాపాలతో పాటు ఆవిడలో ప్రచ్ఛన్నంగా ఉండే ఉదాత్తతనూ, అకల్మషహృదయాన్నీ తిమ్మనగారు ఇందులో కాపీరైటుగా చూపెట్టారు.

భాషలోనూ, భావాల్లోనూ ముమ్మూర్తులా తెలుగుతనాన్ని విరజిమ్మే యీ తెలుగుకవి తెలుగుతోపాటు సంస్కృతంలోకూడ తమకు గల పాండితినీ, వైదుష్యాన్నీ, సర్వసాచితనూ చాటడానికి చక్కని, చిక్కని సంస్కృత ప్రయోగాలు చేశారు. అవి కొన్నే అయినా అయిన్నే ఆయనకు సంస్కృతంపై గల ప్రాభవాన్నీ, సంస్కృత వ్యాకరణంలో గల పటిష్టతనూ బాహాటంగా ప్రదర్శిస్తాయి.

ఏతావాతా, ఈ పారిజాతాపహరణం నందితిమ్మన—కాదు కాదు, ముక్కుతిమ్మనగారి కవితకు పాండిత్యానికీ, కల్పనాప్రాభవానికీ ప్రత్యక్షవర్ణంగా విలసిల్లుతున్నది.





వోలేటి వెంకటేశ్వర్లు: రాగం, తానం, పల్లవి

(విజయవాడ, డిసెంబర్ 1)



వి. ఎస్. లక్ష్మీనారాయణన్

ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితం

## విజయనగర ఆనందగజపతి మహారాజు

(2-వ పేజీ తరువాయి)

ఎందర జూపెనేని వరియింపదు మా కవితా కుమారి క
న్నందుకు దేశముల్ తిరుగుచున్నెను సౌఖ్యములేకపోయె నా
నందనృపాల నీదు సుగుణమ్ములు చెప్పిన నాలకించి వెల
థం దలయూచెగావున తటాలున దీని పరిగ్రహింపుమా.

యీ పద్యంకూడా గురుపాదులదే. ఆనందగజపతి కళా పోషకత్వాన్ని ప్రమవపరచడానికి యీ పద్యం ఒక్కటే చాలు.

### గురజాడ అప్పారావు

ఆనాడు ఆంధ్రదేశాన్ని సాంఘికంగా మార్చడానికి ప్రయత్నిస్తూన్న కొంచరిలో గురజాడ అప్పారావుగారు ఒకరు. ఆయన శ్రీవారి ఆశ్రితులలో ఒకడు, కన్యాశుల్కం అనే నాటకలతో అప్పారావుగారికి అశశినమైన కీర్తి వచ్చింది. ఆ నాటకం అభినవాంధ్రభోజునకే అంకితం,

ఆస్థాన పండితులలో దిగ్గజం కొల్లూరు కామశాస్త్రిలుగారు. మహారాజు ప్రార్థనపై ధర్మసింధువు అనే ధర్మశాస్త్రాన్ని వచనరూపంగా వెలుగుచేసి ఆంధ్రలోకానికి మహోపకారంచేశారు. అది అచ్చయి వ్యాప్తిలో వున్నది అలాగే మాక్సుముల్లర్ వేదాన్ని అచ్చుచేయించడానికి ఆనందగజపతి పదివేల రొక్కం యిచ్చారు.

ఆనందగజపతి చదరంగంలో ఉద్దండుడు. ఆ ప్రాంతంలో చదరంగం ఆట చాలా ప్రచారంలో ఉంది యిప్పటికిన్ని. ఆనాడు కూరెళ్ళ సూర్యనారాయణశాస్త్రిలుగారు చదరంగానికి జీవగఱ్ఱ. రాజుగారు శాస్త్రిలుగారితో చదరంగం ఆడుతూ దానిలోనిపట్లు అన్ని గ్రహిస్తూ చతురంగ విద్యలో చతురుడయాడని, శాస్త్రిలుగారిని గురువుగా భావించి గురుదక్షిణగా గుమడాం అనే గ్రామం సర్వదుంబాలా యినాముగా పట్టాచేసి యిచ్చాడని మా నాయనగారు చెప్తూవుండేవారు పై శాస్త్రిలుగారికి మా నాన్నగారు మేనల్లుడు. సంవత్సరానికీ సుమారు తొమ్మిది నెలలు మేనమామ యింటిలోనే మా నాయనగారువుండేవారు. మోతీమహల్లోపంలకవేసి శాస్త్రిలుగారు. ఆనందగజపతి మహారాజు ఒక గంట కూర్చుని అడేవారట. తరవాత లేచి శాస్త్రిలుగారు తమయింటికి, రాజుగారు అంతఃపురానికీ వెళ్ళిపోయేవారు. ఇక అక్కడినుంచి సేవకుల రాయబారాలతో మూడేసి నాలేసి రోజులు నడిచేదట ఆట. శకటు వేశామని చెప్పరా శాస్త్రిలుగారితో—గుఱ్ఱంమీద వాలుతుందని చెప్పరా....ఇది ఆ మేధావుల ఆట వాటం.

### శాకుంతల నాటకం

సంస్కృతనాటకాలలో ఆనందగజపతికి శాకుంతలం అంటే మైమరపే. తానే దుష్యంత పాత్రధారియై అయోధ్యా మైదానం మీద రంగస్థలం ఏర్పాటు చేయించి నాటకం ప్రయోగింపచేసేవాడట. బుచ్చన్నశాస్త్రి శకుంతల వేషం ఇప్పటికి కళ్ళలో బొమ్మకట్టినట్టు ఉందని పొగుడుతూనే నిజంగా దుష్యంతమహారాజు ఇలాగే వుండివుంటాడు—అని ఆ మహారాజుని ప్రశంసించేవాడు మా పితృదేవుడు

శకుంతల నాటకంలో లలిత శృంగారభరితమైన శ్లోకం ఎవరికి తోచినది వారు వ్రాసి తీసుకురండని పండితులకు చెప్పి రాజుగారుకూడా ఒక శ్లోకం వ్రాసి వుంచుకున్నారు. మర్నాడు అందరూ తమ తమ ఎన్నిక శ్లోకం వ్రాసి తెచ్చి చదివారట. ఆనందగజపతి ఎన్నుకున్న శ్లోకం ఇది—

అపరిక్షతకోమలస్య యాచన్
కుసుమస్యేవనవస్యషట్పదేన
అధరస్యపిపా సతామయా పే
సదయం సుందరి గృహ్యతె రసోస్య.

మూడో అంకంలో శకుంతలా దుష్యంతుల ప్రథమ సమాగమంలోదిది. కౌగలించుకున్న దుష్యంతుడుణ్ణి విడిచిపెట్టు అంటుంది శకుంతల. అలాగే—అంటాడు రాజు. ఎప్పుడు అంటుంది ఆ ప్రశ్నకి రాజు చెప్పిన సమాధానం పై శ్లోకం,

### రాచరికం—రసికత్వం

ఏవిధంగానూ తాకిడిలేక సుకుమారుగావున్న సరికొత్త పువ్వుతేనెను తుమ్మెదలాగ నీఅధరామృతాన్ని సున్నితంగా తాగి నిను విడిచిపెడతాను—అని భావం. ఆస్థానపండితులు ఆనందగజపతి రసికత్వానికి ముగ్ధులయారు. ఆ రాజెంత సరసుడు.

ఈ యుగంలో నిజంగా యిన్ని సులక్షణాలుగల రాజు యీకాలంలో వుండేవాడంటే నమ్మరెవరున్నూ, కాని నమ్మకపోవడం ఎలాగ? మన తండ్రుల కాలంలో వుండేవాడు. ఆమహారాజు. ఎంతచక్కని పేరు—ఆనందగజపతి. గురుపాదులు చమత్కరించారీ పేరు. ఆనందించెవాడు ఆనందింపచెసేవాడున్నూ—అటు ఆనందనామధేయుడయాడని—యీమాత్రం తెలుసుకుని అలాటి మహారాజు మనవాడే అని మనం ఆనందిస్తూ వుందాం.


(వివరాలు 48-వ పేజీలో)

# వివిధభారతి

## అఖిల భారత కదంబ కార్యక్రమము

డిసెంబర్ 1-వ తేదీ గురువారం నుండి డిసెంబర్ 15-వ తేదీ గురువారం వరకు

I వ ప్రసారము
ఉ॥ 7-00 నుండి 9-30
II వ ప్రసారము
10-15 నుండి 12-30 వరకు
III వ ప్రసారము
మ॥ 2-00 నుండి 5-30
IV వ ప్రసారము
సా॥ 6-30 నుండి 10-40
శనివారములు IV వ ప్రసారము
6-30 నుండి రా॥ 11-10 వరకు

ఉ॥ ప్రసారము I

7-00 —8-30
49.71 మీ (6035 కిలోసైె)
7-00 --9-30
49.30 మీ (6085 కిలోసైె)

7-00 వందనవార్ భక్తి గీతావళి
7-30 అర్చన
7-40 ఝలక్ కార్యక్రమ విశేషాలు
కావ్యమాధురి
[ఆదివారములలో]
జెవన్ జ్యోతి
[మిగతా రోజులలో]
7-45 ఉదయగాన్
8-00 మంజూషా
జానపద ప్రాంతీయ సంగీతం
8-15 హిందీలో వార్తలు
8-30 జయమాల
9-30 ప్రసార సమాప్తి

ప్రసారము II
10-15—12-30
31.55 మీ (9510 కిలోసైె)

10-15 రసవంతి
10-30 రంగ్‌తరంగ్
10-15 హిందీలో వార్తలు
10-55 సంగీత సేతు

---

ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

11-00 చిత్రధ్వని
సంక్షిప్త శబ్ద చిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1, 3, 5 ఆదివారములలో పండుగ రోజులలో
రత్నాకర్
సంగీతం, హాస్య రచనలు, నాటకథలు
(ప్రతి నెలా 2, 4 ఆదివారాలు పండుగ దినాలు)

---

11-00 జయమాల
(అన్ని రోజులు)
12-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

31.24 మీ (9600 కిలోసైె)
31.33 మీ (9575 కిలోసైె)
(ఆదివారాలు పండుగ దినాలు)

2-00 అప్నాగర్
మీ యింట్లో అందరికి
(వారములో ఇతర రోజులలో)
2-00 ఫుల్వారీ సంగీత కదంబం
(వారములో అన్నిరోజులు)
2-30 మనోరంజన్
3-30 చౌపరా మాటలు, పాటలు

కర్ణాటక సంగీత కార్యక్రమము

3-45 అంజలి-గీతావళి

4-00—5-30
31.70 మీ (9.615 కిలోసైె)
4-00—4-30
31.33 మీ (9,575 కిలోసైె)

4-00 గీతమాలిక
4-30 మధురగీతం
మీరు కోరిన పాటలు
((ఆది, బుధ, శుక్రవారములు)
5-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-30—9-30
31·33 మీ (9575 కిలోసైె)
6-30—10-40—11-10
49.30 మీ (6085 కిలోసైె)

6-30 జయ్ భారత్
జాతీయ సమైక్యతా గీతాలు
6-45 జయమాల
యుద్ధ సైనికులకు
7-55 వాద్యమాధురి
వాద్య కదంబం
8-00 గజరా
8-15 హిందీలో వార్తలు
8-30 మెహ్‌ఫిల్ కదంబం
8-50 చిత్రశాల
పరిచయ కార్యక్రమము
9-00 చతురంగ్ పాటలు
9-15 హవామహల్
నాటికలు, రూపకముల హాస్యరచనలు
9-30 మన్‌చాహే గీత్
మీరు కోరిన పాటలు
10-30 నూపుర్
10-35 హిందీలో వార్తలు
10-40 ప్రసార సమాప్తి

శనివారములు

10-30 గీతమంజరి లలిత సంగీత
11-00 నూపుర్
11-05 హిందీలో వార్తలు
11-10 ప్రసార సమాప్తి

---

### బెంగుళూర్—బి
365.9 మీ (820 కిలోసైె)
వివిధభారతి (రిలే)

| ఆదివారములలో | ఇతర రోజులలో |
|---|---|
| ఉ॥ 7-00 నుండి 8-30 | ఉ॥ 7-00 నుండి 9-30 |
| 10-50 నుండి 12-50 | 10-50 నుండి 11-50 |
| మ॥ 2-00 నుండి 3-00 | మ॥ 2-00 నుండి 3-00 |
| 4-00 నుండి 5-00 | 4-00 నుండి 5-00 |
| సా॥ 6-30 నుండి 10·30 వరకు | సా॥ 6-30 నుండి 10-30 వరకు |

[వివరాలు 48-వ పేజీలో]

---

ఇతర వివరములకు ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1

Printed at Arutperunjothi Press, Madras-1- Edited and Published by the Station Director All India Radio, Madras-4

# 1966 లో జరిగిన రేడియో సంగీత సమ్మేళనమునుండి కొన్ని ఘట్టాలు



డి. కె. పట్టమ్మాళ్ : బృందం (మద్రాస్, నవంబర్ 2)



ఎమ్. ఎల్. వసంతకుమారి (మద్రాస్, నవంబర్ 4)



మల్లికార్జున్ మన్సూర్ (బెంగుళూర్, నవంబర్ 5)



బి. దేవేంద్రప్ప (బెంగుళూర్, నవంబర్ 2)



మద్రాస్‌లోని చిల్డ్రన్స్ థియేటరులో జరిగిన కార్యక్రమాలకు హాజరయిన ఆకాశవాణి డైరెక్టర్ జనరల్ డా॥ నారాయణ మీనన్, ఇతర ప్రముఖులు.



ఎమ్. డి. రామనాథన్ (మద్రాస్, అక్టోబర్ 31)

# నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం

Regd. No. M. 5404



'నాగార్జున సాగర్ ఆయకట్టు అభివృద్ధి' అను విషయంపై ప్రసంగాన్ని వ్యావసాయిక విషయాల కార్యక్రమములో హైదరాబాద్ కేంద్రంనుండి డిసెంబర్ 7-వ తేదీ సాయంత్రం 6-30 గంటలకు వినవచ్చును